శ్రీ విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాములవారి



# శ్రీ బ్రహ్మముగారి
# కాలజ్ఞానములోని
# అద్భుత మహిమలు
## (రామరాజ్యం)



దుందుభి మార్గశిరం

జనవరి **1983**




ప్రకాశకులు

**శ్రీ వీరబ్రహ్మేంద్ర మిషన్, ఆనందాశ్రమం**

కడప జిల్లా

శ్రీ వీరబ్రహ్మేంద్ర మిషన్ - 4.

శ్రీ బ్రహ్మముగారి కాలజ్ఞానములోని

# అద్భుత మహిమలు

## (రామరాజ్యం)



*

దుందుభి మార్గశిరం
జనవరి 1983

*

ప్రకాశకులు
శ్రీ వీరబ్రహ్మేంద్ర మిషన్
ఆనందాశ్రమము, (వయా) మైదుకూరు, పిన్ : 516 172,
కడప జిల్లా.

శ్రీ విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాములవారి

# శ్రీ బ్రహ్మముగారి కాలజ్ఞానములోని
# అద్భుతమహిమలు
## (రామరాజ్యం)

గ్రంథరచనకు తోడ్పడిన ప్రముఖులు .

కార్తాంతికాభిజ్ఞ,
ఆగమప్రవర్తక, కవి, పండిత
శ్రీ ప్రతాప కృష్ణమూర్తిశాస్త్రి సిద్ధాంతిగారు, తెనాలి.

మా ఆశయముల నాలకించి సలహాలొసంగిన ప్రముఖులు :

దర్శనాచార్య, కళాప్రపూర్ణ,
బహుళ తత్త్వశాస్త్ర గ్రంథకర్తలు,
డాక్టరు కొండూరు వీరరాఘవాచార్యులుగారు, తెనాలి.

వివరణ కర్త :
వి. వీరబ్రహ్మము, ఆనందాశ్రమము.

ప్రకాశకులు :
శ్రీ వీరబ్రహ్మేంద్ర మిషన్,
ఆనందాశ్రమం, (వయా) మైదుకూరు,
కడప జిల్లా.

# శ్రీ బ్రహ్మంగారి కాలజ్ఞానములోని
# అద్భుత మహిమలు
## (రామరాజ్యం)

### ప్రథమ భాగము

కాలజ్ఞానములోని శ్రీరామధర్మజమూర్తి ఉద్భవము, రామధర్మజ రాజ్యమును గురించి సేకరించిన మూలవచనములు, వీటికి తాత్పర్యము.

### ద్వితీయ భాగము

శ్రీరామ ధర్మజమూర్తిని గురించి కాలజ్ఞానములోని శ్రీరంగనాథస్వామి, కావేరి, శ్రీరంగం గురించి సేకరించిన మూలవచనములు మాత్రం.

### తృతీయ భాగము

పై రెండుభాగములలోని అంశములు శ్రీ ఎన్. టి. రామారావుగారికి ఏవిధముగా సమన్వయించినవో వాటి వివరములు గలవు.

పై మూడుభాగములవలన
కాలజ్ఞాన అద్భుతమహిమలు తెలియగలవు.

# నివేదన

దుందుభి సంవత్సర మార్గశిర శుద్ధ పూర్ణిమ (30-12-1982) సంపూర్ణ చంద్రగ్రహణం కలిగినరోజు.

మరుసటి రోజు 31-12-1982 తేది శ్రీ ఎన్. టి. రామారావుగారి పర్యటన, వారి ఉపన్యాసములగురించి నాలో ఆలోచనలు మొదలైనవి. పత్రికలలో ఆ వార్తలు చూచిన ఆశ్చర్యకరములై వారి పోకడలు దైవశక్తితో కూడు కొన్నట్లును తోచినవి. ఈ సంఘటనలు భవిష్యత్తును గురించి శ్రీ వీరబ్రహ్మేంద్రస్వాములవారు లిఖించిన కాలజ్ఞానములో ఉన్నాయని ఆలోచించి 31-12-82 వ తేది సాయంత్రము ప్రశాంత స్థలములో వుండి కాలజ్ఞానమును చదువుట ప్రారంభించితిని. ఆరోజు వీటికి సంబంధించి 4, 5 హేతువులు మాత్రం కనిపించినవి. ఆరోజునుండి కాలజ్ఞానమును పూర్తిగా పలుమారులు చదువుట జరిగినది. 5 రోజులకు ఇంకను కొన్ని హేతువులు దొరికినవి.

వీటిని తెనాలిలోని కవి, పండితులు శ్రీ ప్రతాప కృష్ణ మూర్తిశాస్త్రిగారికిని, తత్త్వసిద్ధులు - అమనస్క-యోగులు, దర్శనాచార్య, కళాప్రపూర్ణ, డాక్టరు కొండూరు వీరరాఘవా చార్యులుగారికిని చూపించుట జరిగినది.

ఇట్టి దృష్టితో శ్రీ బ్రహ్మంగారి కాలజ్ఞానములోని అద్భుతమహిమలు అను గ్రంథమును ప్రకటింప వలయు ననెడి సంకల్పము కలిగినది.

ఈ గ్రంథరచనకు మహాశివరాత్రి పర్వదినమున 11-2-83 వ తేదీన కాంచీపురంలో శ్రీ ఏకాంబరేశ్వర స్వామి సన్నిధిలో ప్రారంభము జరిగినది. మరునటిరోజు మాఘబహుళ అమావాస్య శ్రీరంగంలో ఉదయం కావేరీ స్నానమాచరించి శ్రీ రంగనాథస్వామి సన్నిధిలోను ఈ గ్రంథరచన జరిగినది. ఈ కార్యక్రమము సఫలీకృతమగు టకు శ్రీ రంగనాథస్వామిని సేవించుట యైనది. ఆ రోజు నుంచి ఈ గ్రంథముయొక్క రచన పూర్తిచేయుటకు కొన్ని రోజులు పట్టినది.

ఈ కాలజ్ఞాన వచనములకు పండిత ప్రతాప కృష్ణ మూర్తిశాస్త్రిగారిచే తాత్పర్యములు వ్రాయించుట యైనది.

కళాప్రపూర్ణ, డాక్టరు కొండూరు వీరరాఘవాచార్యులు (ప్రత్యానంద) గారిచే సరిచూపించి పిమ్మట ముద్రణకు ఇచ్చుట యైనది.

ఈ గ్రంథములో శ్రీ రామధర్మజమూర్తి ఉద్భవము మున్నగు వాటికి కాలజ్ఞానములోని 58 హేతువులు చూపించ బడినవి. ఇవిగాక శ్రీ రంగనాథస్వామి, కావేరికి సంబం ధించి 14 హేతువులు మొత్తం 72 హేతువులు చూపబడి నవి. కాలజ్ఞానములో శ్రీ బ్రహ్మముగారు లిఖించిన ఈ హేతువులను బట్టి జరుగు విషయములు తాత్పర్యములో

తెలుపబడినవి. ఈ గ్రంథ విషయసూచిక కూడ ఇందు చేర్చబడినది.

ఈ గ్రంథరచన ఏ రాజకీయ పార్టీలను ఉద్దేశించి నట్టిది కాదు. కేవలము శ్రీ బ్రహ్మముగారి కాలజ్ఞానములోని మహిమలు ప్రజలకు తెలియజేయుటకు ఉద్దేశించినట్టి గ్రంథ మిది.

ప్రజలెల్లరు ఈ గ్రంథమును చదివి బ్రహ్మముగారి ధర్మప్రచారమునకు, తత్వజ్ఞానమునకును, భక్తి ప్రబోధము నకును వారి ఆశయ సాఫల్యసిద్ధులకును ఉపక్రమించగల రనియు, తద్వారా లోకకల్యాణమును సాధించగలరనియు నమ్ముచున్నాము.

1974 వ సంవత్సరములో శ్రీ బ్రహ్మంగారి మఠము వారిచే ప్రకటింపబడిన "కాలజ్ఞాన గ్రంథము" నుండి ఈ హేతువులు సేకరింపబడినవి.

వి. వీరబ్రహ్మము (వ్యవస్థాపకులు),
21—5—83 శ్రీ వీరబ్రహ్మేంద్ర మిషన్,
ఆనందాశ్రమం.

—:౦:—

శ్రీ ఎఱ్ఱోజు మాధవాచార్యులుగారు, ఎమ్. ఎ.,
నూజివీడు కాలేజి ప్రిన్సిపాల్ (రిటైర్డ్),
Honorary FELLOW - Andhra University.

# అభినందనము

శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామి భగవదవతార పురుషుడని గట్టిగా నమ్మి పూజించు భక్తులు లోకమునం దెందరో గలరు. శ్రీవారి ఆలయమో, భజన మందిరమో, జయ స్తంభమో, పతాకమో వెలయని గ్రామము తెలుగునాట లేదు. శ్రీవారి తత్త్వములను, కాలజ్ఞాన పదములను, వచనములను పాడుచు, సందర్భోచితముగ ఉదాహరింపని తెనుగువాడు కన్పింపడు. పండితులకు సైతము తెలియరాని వేదాంత విద్యారహస్యముల నీ గురుదేవుడు పండిత పామరుల కెల్లరకు కరతలామలకము గావించెను. నాలుగువందల యేండ్లనాటి మాటగదా ఇది! ఆనాటికే దేశమున కావశ్యకములైన హిందూ మహమ్మదీయైకమత్యము, అస్పృశ్యతా నివారణము, కులమత విభేదనిరాసము, సర్వమత సామరస్యం, స్త్రీ విద్యా ప్రచారము మున్నగు సంఘ సంస్కరణములను ఆ మహనీయుడు ప్రబోధించి, అనుష్ఠానమున ప్రదర్శించి చూపెను. మహా తపస్సంపన్నుడగు నాతడు రచించిన కాలజ్ఞాన గ్రంథము భవిష్య పురాణము, భారత భవిష్య

పర్వములకు విలక్షణముగా భవిష్యద్విషయము లనేకము లోకమున కెఱింగించెను. అద్దానిని లోతుగా చూచి పరిశీలించుచు అధ్యయనము చేసిన వారెవరును లేరు. అందలి మర్మములను విడదీసిచెప్పగల అనుభవవేత్తలును కన్పింపరు.

"గాంధీమహాత్ముడు వైశ్యుడుగా అవతరించి, భారత దేశమునకు స్వరాజ్యము సంపాదించి పెట్టునని, స్త్రీ పున ర్వివాహములు సర్వసాధారణములగునని, హరిజనులధికారు లగుదురని, దేశమును మహిళలు పాలింతురని, ఇంకెన్నెన్నో అపూర్వ విశేషములు, వింతలు ఉత్పత్తిల్లునని కాలజ్ఞానములో బ్రహ్మంగారు చెప్పనే చెప్పినారు గదా!" అని నేటి దేశ కాలపరిస్థితులను పరామర్శించుచు శ్రీవారి మహిమలను ప్రశంసించు జనవాక్యములు సర్వత్ర వినుచుందుము.

చిరకాలము గాంధి మహాత్ముని అడుగుజాడలలో నడచుచు వారి నిర్మాణ కార్యక్రమమును త్రికరణశుద్ధిగా నిర్వహించుచు, వారి శిష్యాగ్రణి వినోబాభావే సారథ్యము వహించిన సర్వోదయ ఉద్యమ కార్యకర్తలయం దగ్రగామిగా వర్తించుచుండిన ఉత్తమ వ్రతులు శ్రీ. వి. వీరబ్రహ్మం గారు. వీరు పరమ నైష్ఠిక బ్రహ్మచారి. సదాచార పరులగు సత్సంగులు, నిష్కామ కర్మిష్ఠులగు నిస్సంగులు. నిర్మోహులై నేడు నిశ్చలతత్వముపైపు పయనించుచున్న పుణ్య యోగులు. వీరిదృష్టి ఇపుడు సంఘమునుండి సత్యమునందు కేంద్రీకృత మగుచున్నది.

శ్రీ వీరబ్రహ్మముగారు నలువదేండ్లనాడు స్థాపించి జనోపయుక్తముగా నిర్వహించుచుండిన మైదుకూరు

"ఆనందాశ్రమము" - వీరు నేడు స్థాపించిన "శ్రీ వీర బ్రహ్మేంద్ర మిషన్" కు కార్యస్థానమగుచున్నది. శ్రీ వీర గురుని "కాలజ్ఞానము" న పెక్కుచోట్ల "ఆనందాశ్రమ" ప్రస్తావన కలదు. వీరబ్రహ్మముగారి ఆనందాశ్రమము "శ్రీ వీరబ్రహ్మేంద్రమిషన్" కు కార్యస్థానమగుటయు, ఈ నామ సాదృశ్యములును, దైవప్రేరణములై యుండవలె. శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామి విజ్ఞాన సర్వస్వమును వీరిపుడు అత్యంత శ్రద్ధాప్రపత్తులతో పరిశోధనాత్మకముగ అధ్యయనము చేయుచున్నారు. ఇందువీరు దర్శించుచున్న సత్యములకు, లోకపు పోకడలకు చేయు సమన్వయము లత్యాశ్చర్యకరములును, అమితానంద దాయకములును నగుచున్నవి.

నేటి ఆంధ్ర రాజకీయ పరిణామములు సైతము నాల్గువందల యేండ్లనాడే కాలజ్ఞానమున చెప్పబడియున్నవని "శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామి మహిమలు" అను నీ గ్రంథమున శ్రీ వీరబ్రహ్మంగారు సప్రమాణముగా నిరూపించుచున్నారు. జ్యోతిశ్శాస్త్ర పండితులుకూడా చెప్పని మొన్నటి దుందుభి సంవత్సర మార్గశిర పూర్ణిమనాటి (30-12-1982) చంద్రగ్రహణ ఫలవిశేషములనుగూర్చి ప్రపంచము నాశ్చర్యానందములలో నోలలాడించి "పంచమం," (5-1-1983 న జరిగిన యెన్నికలు వాని ఫలితములు గురించి, 9-1-1983 ఆదివారమునాటి ప్రభుత్వ పట్టాభిషేకమును గురించి, విజయాభిరాముని విభూతి, రుద్రాక్ష కాషాయాంబర ధారణాదుల గురించి, అనంతర పరిణామ క్రమముల గురించి "రామధర్మజ" పరిపాలనము గురించి, ఇంకెన్నెన్నో అనూహ్య

షులగు ఘటనల గురించి వీరుదాహరించుచు చెప్పు కాలజ్ఞాన వాక్యముల నింతవరకెవ్వరును గు ర్తింపనేలేదు. శ్రీస్వాముల వారు శైవసంప్రదాయమునకు చెందిన వారగుటచే కాలజ్ఞానమునగల శ్రీరంగము, కావేరి, శ్రీరంగనాథ స్వామి వార్ల విశేష ప్రశంసల నెవ్వరును అంతగా గమనించినట్లు లేదు. శ్రీ స్వామివారు శ్రీరంగేశ్వర పాదలగ్నచిత్తులని గురుతించిన వారును శ్రీ వీరబ్రహ్మంగారే.

నేటి మన ముఖ్యమంత్రి శ్రీ రామారావుగారు రాజకీయరంగ ప్రవేశమునకు పూర్వము పరమ నిష్ఠాగరిష్ఠులై నాందీ పూజగా శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామి పాత్ర ధరించి, "శ్రీ స్వామివారి చరిత్ర" చిత్రమును నిర్మించుటకును దైవప్రేరణమే కారణమనిపించుటయం దాశ్చర్యములేదు.

ఆ యీ చరిత్రాంశములకు పెక్కింటికి శ్రీ వీరబ్రహ్మంగారిందు కాలజ్ఞాన వచసములతో సమన్వయము చేసినతీరు పరమ విశిష్టముగ, ప్రశంసార్హముగ నున్నది. రాష్ట్రప్రభుత్వ నేతృత్వము వహించి నిర్నిరోధముగా పురోగమించుచున్న శ్రీ నందమూరి తారక రామారావు గారికి అనన్య సామాన్యమైన ప్రజామోదమునకు, ప్రభుత్వ నిర్వహణ సామర్థ్యమునకు ఆయన దృఢసంకల్పము, గాఢ పరిశ్రమము కారణములగుట సత్యము. వీని అన్నింటివెనుక గల దైవబలము అఖండమైనదని మాత్రము ఎల్లరును గ్రహించవలయునని కాలజ్ఞానము బోధించుచున్నది,

అనితర సాధ్యమైన కాలజ్ఞాన గ్రంథ పరిశోధన ఫలముగా లోకమునకీ విశేషాంశములనెల్ల "శ్రీ వీర బ్రహ్మేంద్రస్వామి మహిమల" యందెత్తి చూపిన శ్రీ వీర బ్రహ్మంగారు ధన్యులు. శ్రీ స్వామివారి అనుగ్రహము వీరికి సమృద్ధిగా లభించి వీరు సంకల్పించిన సత్కార్య సముదాయము విజయవంతమగుగాక!

నూజివీడు,<br>11-5-'83

ఎత్తోజు మాధవాచార్యులు.



దర్శనాచార్య, కళాప్రపూర్ణ,

డా॥ కొండూరు వీరరాఘవాచార్యులు వారి

# అభిప్రాయము.



కాలజ్ఞానము వ్రాసెడి సంప్రదాయము శైవ సిద్ధుల నాటి నుండియు ప్రారంభమైనది. అంతకు పూర్వము మన పురాణములలో కూడ భవిష్యత్ విషయములు ప్రస్తావింప బడక పోలేదు. అట్టివానిలో భవిష్య పురాణము ముఖ్యమైనది.

శైవసిద్ధులు అష్టవిభూతి సంపన్నులు. వారు యోగము చేత అనేక సిద్ధులను, అతీతానాగత జ్ఞానమును సంపాదించిన వారై ప్రకాశించినారు. ఆ సంప్రదాయము బ్రహ్మముగారి వరకు, ఈశ్వరమ్మ వరకు కొనసాగుచునే వచ్చినది. దక్షిణ భారత దేశమున శ్రీ వీరబ్రహ్మేంద్రుల కాలజ్ఞానమునకు ఎంతో ప్రచారము, గౌరవము కలదు. ఆ త్రికాలవేది చెప్పినవి చెప్పినట్లు జరుగుట మనమెరిగిన విషయములే. అయినను కాలజ్ఞానము అనేక మర్మవాక్యములతోను, తాత్విక రహస్యములతోను నిండినదై సామాన్యులకు అవగాహన కాకయున్నది. ఈ విషయమును బ్రహ్మముగారే స్వయముగ చెప్పియున్నారు. అనేక మర్మవాక్యములతో గూడిన బ్రహ్మముగారి కాలజ్ఞానము జ్యోతిశ్శాస్త్రాంశములమీదను

ఆధారపడి యున్నదని దానిని చదువువారికి తెలిసియేయున్నది. అందువలన అనేకులు దానిజోలికి పోజాలకయున్నారు. ఎట్లైనను కాలజ్ఞాన వాక్యములకు పెక్కింటికి అర్థము చెప్పుట కష్టసాధ్యమైనపనియే.

ప్రకృత గ్రంథమున ప్రస్తావింపబడిన దుందుభినామ సంవత్సర మార్గశిర మాసమున కలిగిన చంద్రగ్రహణము గొప్ప ప్రాధాన్యము కలదని శాస్త్రజ్ఞులు భావించియే యున్నారు. బ్రహ్మముగారు కూడ ఈ గ్రహణ ప్రాముఖ్యమును వివరించినట్లు ఈ గ్రంథకర్త నిరూపించియున్నారు. శతాధికములుగానున్న కాలజ్ఞానములోని అద్భుత మహిమలలో రామరాజ్యమును గూర్చి ఈ గ్రంథమున వివరింపబడినది ఇందు "రామధర్మజ సముద్భవము" ను గూర్చి పూర్తి వివరణముకలదు. రామరాజ్యము, ధర్మరాజరాజ్యము లోకములన్నియు కోరునట్టివే. బ్రహ్మముగారు భావించిన రామధర్మజరాజ్యము లేక రామరాజ్యము గడచిన మార్గశిరము నుండి ప్రారంభమైనదని శ్రీ. వి. వీరబ్రహ్మముగారు ఈ గ్రంథమున అనేక హేతువులచే నిరూపించినారు. తమకు సందేహములు వచ్చినపుడు కాలజ్ఞాన తత్వవేత్తలైన పండితులను కూడ సంప్రదించి తగునిర్ణయములు చేసికొన్నట్లు తెలియుచున్నది. అట్టివానిలో చంద్రగ్రహణ విశేషాదుల విషయమున జ్యోతిశ్శాస్త్ర పండితుల సాయమును వీరు పొందినారు. ఈ గ్రంథములో "సర్వ నాటక ధారి," విభూతి, తిలకం, సన్యాసి వేషము, ఆదివారము పట్టాభిషేకము, కర్మనిష్ఠుల గౌరవించుట మొదలగునవి వర్తమానకాల రాజకీయ స్థితిగతులకు సరిపడుచున్నవి. నిజముగా

"కాలజ్ఞాన గ్రంథమున ఇన్ని విశేషములున్నావా ?" యని అనేకులకు ఆశ్చర్యము కలుగకపోదు. రాగద్వేషముల దరికి రానీయక అహంకార మమకారములకు చోటీయక కాలజ్ఞానము పరిశీలించినచో ఇట్టి రహస్యములను బయలుపరచ వచ్చునని ఈ గ్రంథము చెప్పుచున్నది.

కావున ఈ గ్రంథకర్త కృషి మిక్కిలిగా మెచ్చ దగినదై యున్నది. తుదిగా కాలజ్ఞానమును గూర్చి రెండు మాటలు చెప్పి ముగింతును. బ్రహ్మముగారి కాలజ్ఞానమునకు మొట్టమొదటి ప్రచారకుడు అన్నాజయ్య. ఆయననుండి అనేకులు ప్రతులను వ్రాసికొని యుందురు. ఈ నాలుగు వందల ఏండ్లలో ఎందరినుండి ఎవరెందరు వ్రాసికొని యున్నారో చెప్పలేముకదా! ఈ వ్రాతలలో కాలజ్ఞానము యొక్క ప్రథమ స్వరూపము ఎన్నివిధములుగా మారినదో ఎవరెరుంగుదురు. అనుక అచ్చులచ్చుటకల పెక్కు కాలజ్ఞాన ప్రతులను సేకరించి పరిశీలించి శుద్ధమైన పాఠములను తయారు చేయవలసియున్నది. అట్టిపని జరిగినచో కాలజ్ఞాన సుస్వరూప దర్శనము కాగలదు.

ఇట్టిపనికి కడప మండలములోని శ్రీవీరబ్రహ్మేంద్ర మిషన్ వారే పూనుకొనవలసియున్నది నా ఎరిగినంతలో మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున 'వీరప్పయ్య' కాలజ్ఞానము అను గ్రంథము కలదు. అట్లే కన్నెమరా లైబ్రరీలో కూడ ఒక కాలజ్ఞాన గ్రంథము చూచినట్లుగుర్తు.

కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్తు పుస్తకాలయమున బ్రహ్మముగారి "కాళికాంబ హంస కాళికాంబ" అను మకుటముతోడి పద్యముల గ్రంథ మొకటికలదు.

తంజావూరు లిఖిత పుస్తకాలయమున కూడ కాల జ్ఞాన గ్రంథమున్నట్లు మిత్రులవలన వినుటయైనది.

ఇంక ఎన్నెన్నిచోట్ల ఎన్నెన్ని కాలజ్ఞాన లిఖిత ప్రతులు గలవో ఎవరికి తెలియును, ఇట్టివాటి నన్నింటిని సంపాదించి ప్రతులు వ్రాసికొని పరిశీలన చేయవలసినపని ఒకటి మనపై ఉన్నది.

ఈపని జరిగినచో వీరబ్రహ్మేంద్రులకు సేవచేసిన వారమేకాదు, మానవ సమాజమునకు సేవచేసి, మార్గము చూపిన వారము కాగలము.

ఇంకొక సూచన. శ్రీ వీరబ్రహ్మేంద్రుల తత్వ ప్రచారము మూలమున మానవ కల్యాణమును సాధింప దీక్షపూని "శ్రీ వీరబ్రహ్మేంద్ర మిషన్" స్థాపించిన కార్య కర్తలు అచిర కాలముననే ఒక మాసపత్రికను గూడ నెల కొల్పి తద్వారా తమ ఆశయములను ప్రచారము చేసిన బాగుండునని అస్మదాదుల అభిప్రాయము.

తెనాలి
2-5-83

కొండూరు వీరరాఘవాచార్యులు

—:o:—

శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తిగారు,
కార్యదర్శి, ఆధ్యాత్మ ప్రచారక సంఘం,
సంపాదకుడు – "పరమార్థవాణి".

ఓం

మంగళాశాసనము

## అభిప్రాయము

శ్లో॥ సంసార కటు వృక్ష సద్వే ఫలే హ్యామృతోపమే।
సుభాషిత రసాస్వాదః సంగతిః సుజనే జనే॥

ఆనందాశ్రమ సంస్థాపకులూ, వ్యవస్థాపకులూ, బ్రహ్మచర్య నిష్ఠాగరిష్ఠులు, ఆధ్యాత్మిక గ్రంథ పఠన శ్రవణ, మనన వివేషాసక్తి పరాయణులూ, ప్రముఖ సర్వోదయ కార్యకర్తలు అయిన మహర్షితుల్యులు, బ్రహ్మశ్రీ వి. వీరబ్రహ్మముగారు 6 మాసాల అహోరాత్ర దీక్షాకాలంలో ఈ గ్రంథరత్నరచన, ప్రచురణ, ప్రచారాలు చేయగలిగారు. వీరి కృషికి సంపూర్ణంగా రచనలో ప్రచురణలో చేయూత నిచ్చిన బ్రహ్మశ్రీ ప్రతాప కృష్ణమూర్తిశాస్త్రి సిద్ధాంతిగారు అభినందనీయులు.

దివ్య తపశ్శక్తి సంపన్నులు, అవతారమూర్తులు అయిన శ్రీ వీరబ్రహ్మముగారి "కాలజ్ఞానం" పరమప్రమాణ గ్రంథంగా వర్తమాన పాలకుల వర్ణనలకు సంబంధించిన

72 హేతువులతో యీ గ్రంథరత్నాన్ని పాఠకులకు అందించి సమాజానికి మహోపకారం చేసారు.

హిందూధర్మ పరాయణులు, విశేషించి విద్యార్థులు యిట్టి గ్రంథరత్నాలను విశేషంగా పఠించడంవల్ల ఆత్మ కళ్యాణంతో జగత్ కళ్యాణాన్ని సాధించి తమ జన్మను అవశ్యం సార్థకం చేసికోగలుగుతారు.

హేతువాదులు, భౌతికవాదులూ చెలరేగుతూ మహాత్ములైనవారిని దుయ్యబట్టే యీ కాల మహాప్రవాహంలో సమాజం పతనంకాకుండా ధర్మ, దైవశక్తులను గ్రహించి ముందడుగు వెయ్యాలంటే యిట్టి గ్రంథరత్నాలు విశేష ప్రచారం కావాలి.

ఆబాలగోపాలానికి సుగమంగా బోధపడే సరళ మధురశైలిలో సోదాహరణ పూర్వకంగా రచన జరిగింది. ప్రజలు, ప్రభుత్వమూ ముందుకు వచ్చి యీ గ్రంథ ప్రతులను విశేషంగా కొని చదివి, చదివించి; జగత్కళ్యాణానికి అవశ్యం తోడ్పడెదరుగాక! రచయితల కృషికి సర్వ హృదయాంతర్యామియైనపరమాత్మ సకాలంలో సత్ఫలితాలను అవశ్యం ప్రసాదించుగాక!

శేషం శ్రీ హరిస్మరణమ్

రాజమండ్రి
11—5—83

పురాణపండ రాధాకృష్ణమూర్తి

శ్రీ కొలిపాక ఆదినారాయణశర్మగారు,
(ప్రకృతిశర్మ) సూర్యోపాసనాపరులు,
కార్యదర్శి, ప్రకృతికార్యాలయ ట్రస్టు.

## శ్రీ బ్రహ్మముగారి కాలజ్ఞాన నిర్ణయములలోని నిదర్శనములు - ఆశ్చర్యకర సంఘటనలు

యోగసిద్ధి, త్రికాల జ్ఞానశక్తి, దేశోద్ధరణ చేయగల సామర్థ్యము పుణ్యపురుషుడగు శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వాములవారు కాలగతిలో కల్గుపరిణామములను తమ ఖగోళ, జ్యోతిష శాస్త్రపరిజ్ఞానముతో వ్రాసి ప్రసిద్ధికెక్కి యున్నారు.

మన దేశపరిస్థితులు, అందు ముఖ్యముగా త్రిలింగ దేశపరిస్థితులు దుర్దశలో నున్నప్పుడు వానిని సరిదిద్దుటలో పరికరముగ ఉపయోగపడగల దైవీశక్తిచే ప్రభావితుడైన ఒకవ్యక్తి నాయకుడుగా వరింపబడి త్యాగదీక్షతో ధార్మికకృషి చేయగలడని సూచన చేసినారు.

అట్టి నాయకుని జనన వివరములు, ఆయన దైవీశక్తి ప్రభావిత పరవశత్వముతో నాయకత్వ స్వీకారము కొరకు చేయు సాహసోపేత కృషి, దాని ఫలితములు సూచింపబడినవి.

సమాజ శ్రేయస్సును కోరునట్టి జిజ్ఞాసువులు శ్రీ బ్రహ్మంగారు శాస్త్రపరిజ్ఞానముతోను, యోగదృష్టితోను

చెప్పిన భవిష్యత్ నిర్ణయములు నిజమా కాదా అని తెలిసి కొనుటకు కుతూహలపరులై యుండుట సహజము. కాన శ్రీ బ్రహ్మముగారు కాలజ్ఞానములో తెలిపిన వివరములను పరిశీలించి వారు వర్ణించిన నాయకుని గుర్తుపట్టుట, జరిగిన సంఘటనలను సరిపోల్చి చూచుకొనుట, తదనంతరము భక్తిశ్రద్ధలతో ఉపనిషత్ ధర్మబద్ధముగ ఆ నాయకుడు ప్రారంభించు సకల సత్కార్యక్రమములకు జాతిశ్రేయస్సు నాకాంక్షించుచు యథాశక్తి నిర్మాణాత్మక సహకారము నిచ్చుట ప్రతిపౌరుని విధిగదా!

దేశభక్తికి సంబంధించిన ఈ కృషిలో ముఠారాజకీయ వాదములకు, హింసలకు దూరముగనుండి స్థితప్రజ్ఞత్వ లక్షణముల పెంపొందించుకొని సమదృష్టితో జగన్మాత నామ స్మరణమును శివజీమహరాజ్ వలె చేయుచు ("అంబ, జగదంబ, వేదాంబ, అంబికాంబ" మున్నగు మధురనామములను చర్చించుచు) వివేకవంతముగు తమ నిర్ణయములను అందరికీ తెలుపుచూ సహకార సాధన చేయు సదవకాశము, స్వాతంత్ర్యము జన్మహక్కుగా అందరికీ కలదుగదా!

విజయవాడ - 1. కొలిపాక ఆదినారాయణశర్మ

# కృతజ్ఞతలు

మా యీ గ్రంథరచనకు తోడ్పడిన ప్రముఖులు,
పరిశీలనా దృష్టితో చదివి తమ అభిప్రాయములను
వ్రాసియిచ్చిన ప్రముఖులు

కార్తాంతికాభిజ్ఞ,
అగమప్రవర్తక, కవి, పండిత
శ్రీ ప్రతాప కృష్ణమూర్తిశాస్త్రి సిద్ధాంతిగారు
తెనాలి.

శ్రీ ఎఱ్ఱోజు మాధవాచార్యులుగారు, ఎమ్. ఎ.,
నూజివీడు కాలేజి ప్రిన్సిపాల్ (రిటైర్డ్)
Honorary FELLOW - Andhra University.
నూజివీడు, కృష్ణాజిల్లా.

కళాప్రపూర్ణ, డాక్టరు
కొండూరు వీరరాఘవాచార్యులుగారు, తెనాలి.
(ప్రత్యానంద)

శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తిగారు,
కార్యదర్శి, ఆధ్యాత్మిక ప్రచార సంఘం,
బహుళ అధ్యాత్మిక గ్రంథకర్తలు,
సంపాదకులు - "పరమార్థవాణి" - రాజమండ్రి.

శ్రీ కొలిపాక ఆదినారాయణశర్మగారు,
(సూర్యోపాసనాపరులు)
కార్యదర్శి, ప్రకృతికార్యాలయం ట్రస్టు, విజయవాడ - 1.

వీరికి హృదయపూర్వక కృతజ్ఞతాభివందనము లర్పించు చున్నాము.

వి. వీరబ్రహ్మము (వ్యవస్థాపకులు),
శ్రీ వీరబ్రహ్మేంద్ర మిషన్,
ఆనందాశ్రమం.

—o—

# వి ష య సూ చి క



## ద్వితీయ భాగము



## తృతీయ భాగము



అనంత కోటి బ్రహ్మాండ విజ్ఞాన ఘనమూర్తయే
విశ్వ సృష్ట్యాది సంక్షేమ వృద్ధి కర్త్రే నమో నమః ॥

# శ్రీ బ్రహ్మంగారి కాలజ్ఞానము:లోని అద్భుత మహిమలు

శ్రీ విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వామివారు తన పూర్వావతారముఁ జెప్పి పిదప ఈ యవతారమున దేశమున కలుగు భూత భవిష్యద్వర్తమానములలో సంభవించు మంచిచెడుగులను కూడ ఆధ్యాత్మిక ప్రబోధముతో క్రోడీకరించి వెలువరించినారు.

అట్టి బోధనాత్మక కాలజ్ఞాన గ్రంథమున తన వర్తమానకాలంబున జరుగు విషయముల ననేకముల వ్రాక్రుచ్చి తదుపరి తన భవిష్యత్ కాలమును కూడ తెలిపియున్నాడు. ఆ విషయమున తత్కాలికములగు గ్రహగతులు, వివరములు గ్రహణాదులు కూడా తన తాళపత్ర గ్రంథములో వ్రాసి యున్నాడు.

అందులో రామధర్మజుల ఉద్భవం రామరాజ్యం గురించి చాల విషయములు తెలిపియున్నాడు.

రామధర్మజుల ఉద్భవమునకు, రామధర్మజ రాజ్య పాలనకు అనేక హేతువులను లిఖించి యున్నాడు. అందులో ముఖ్యమైనది చంద్రగ్రహణం, ఇతర హేతువులను ఇందులో తెలుపుచున్నాము. వీటినిబట్టి రామధర్మజ ఉద్భవం, రామ రాజ్యపాలన, ఇతర లోకవిషయములు స్థిరీకరించబడిన వనుట నిశ్చయము.

కాలజ్ఞాన గ్రంథములో శ్రీ బ్రహ్మముగారిచే లిఖింప బడినవే అనేక విషయములు ఇందులో తెలుపబడుచున్నవి.

ఈ అవతారమూర్తి ఉద్భవము, వీర వసంతుడనియు, వీరధర్మజుడనియు, రామధర్మజుడనియు, రామ మూర్తి, రామావతారమనియు పేర్లతో పేర్కొనుట జరిగినది.

రామధర్మజరాజ్య ప్రసక్తిలో నేటి సూర్య చంద్ర గ్రహణములు ప్రత్యేకతను పొందినవి.

## 1. చంద్రగ్రహణం

### కాలజ్ఞాన మూలం :

శ్లో॥ అస్మిన్ శ్రీశైల దేశేతు
కంకణాకార ముచ్యతే ।
శేషాద్రి గౌతమీ మధ్యే
ఉడ తోది విదృశ్యతే ॥

తాత్పర్యము :

మన శ్రీశైల మహానగరము ప్రధానముగాగల తెలుగు దేశం (త్రిలింగ) లో కనబడు కంకణాకార గ్రహణమును గురించి తెలుపుచుంటిని. ఈ గ్రహణము తూర్పున గోదావరీ ప్రాంతమున ఉదయించి తిరుమల శ్రీశైలభాగమున ఆకస మున గనుపించును.

### కాలజ్ఞాన మూలం :

పగలు నక్షత్రము లగుపడును.
సూర్యునికి ఇవతలగా శుక్రుడున్ను,
ఆ శుక్రునికి యీవల ఆవల
స్వాతిచిత్త లుండును.

అప్పుడు సూర్యుని నడుమ చంద్రుడు
అంతా ప్రవేశించి ఉండును.
మధ్యకాలానకు రవిబింబము
30 లిప్తలు అనగా
మరుగుమాట
ఈ సంగతి తెలియజేస్తూ వున్నాము.
సూర్యుడు ముక్కాణి బింబముండును.
ఈ బింబము చుట్టు వారా దిరుగును.
అప్పుడు నక్షత్రోదయం అవునని
ఈశ్వరుడు పలుకు చున్నాడు.

అయితే యీ గ్రహణాలలో
సూర్య గ్రహణం
వలయాకృతిగా వుండును.
ఆ సూర్యబింబము నడుమగా
"శ్రుతి" పీతాభాస్వత్యణూపమా,
అనే విష్ణురూపం
మా భక్తులైన వారికి తెలుసును.

## కాలజ్ఞాన మూలం :

శ్లో॥ పౌషామా పౌర్ణమీ మధ్యే
లోకే ఖ్యాతిం గమిష్యతి।

తదాతు పుష్పవృష్టిః స్యా
ద్వర్ధన్తే పుణ్య జంతుషు ॥

## కాలజ్ఞాన మూలం :

అమావాస్యనాడు
చంద్రుడు ఉదయిస్తూవున్నాడన్న మరుగు
ఈ మాట తెలియజేస్తూ వున్నాము.
సూర్యబింబ ప్రమాణం ౬౫౦౦ యోజనాలు.
చంద్రబింబము ౪౮౦౦ యోజనాలు.

## కాలజ్ఞాన మూలం :

శ్లో॥ ఛాదయే దర్క మిందు స్స్యాత్ ॥

సూర్యుని ఆచ్ఛాదించేవాడు
చంద్రుడు గనుక నున్న।
శీతాంశుబింబం వలయం స్యాత్ ॥

పూర్వం బింబాధికం
యథా చంద్రబింబము
లిప్తలు ౬-౪౭ ఘడియలు.
సూర్య బింబము లిప్తలు ౧౦-౪౮.
మానైక్య బింబము ౧౦-౧౮

తచ్ఛరోసంభవేచ్ఛన్న విష్ణువచ్ఛాయల చేత
తీసుకు రాబడ్డ "ఘు" వంటి శుద్ధ విశేషం
తీసివేసిన గ్రాస లిప్తలు.
శ్రీశైల దేశానకు శూన్యమైనది.
విలిప్తలున్నూ శూన్యమైనవి.
యీరీతిన సూర్యమండల మందు
చంద్రుడు అంతా ప్రవేశించి యుండును.
చుట్టు వారా ఎక్కువగా నున్న
సూర్యబింబము వలయాకృతి అవును
నడుమ నున్నటు వంటి చంద్రుడు
విష్ణురూపంగా అగుపడును
ఇదే అమావాస్య పూర్ణిమ.
అనగా సూర్యమండల మందు
చంద్రుడు ఉదయించినాడని
తత్త్వవేత్తలు పలుక బడిన మరుగుమాట.
యిదే అమావాస్యనాడు
చంద్రోదయ మయినది
అని బ్రహ్మవేత్తలైనవారు
తెలిసికొని
సంతోషపడుతున్నారు
అనగా అంతర్దృశ్యమగు దృశ్యం

బాహ్య ప్రపంచంలో కనిపించి
పుణ్యపురుషుల మీద
పుష్పవర్షం కురియును.
అంటే యోగదృష్టి
ప్రత్యక్షమగుట అని అర్థము.

# 2. చంద్రుడు

## కాలజ్ఞాన మూలం :

శ్లో॥ చంద్రమేక సమం విష్ణుం
చంద్రమేక సముద్భవం ।
చంద్ర సూర్య సమం వందే
చంద్ర జ్యోతిమయో మయ ॥

## తాత్పర్యము :

శ్రీ బ్రహ్మముగారు తన కాలజ్ఞాన గ్రంథమున వర్తమాన కాలంబున జరుగు విషయముల ననేకముల వ్రాక్రుచ్చి తదుపరి తన భవిష్యత్కాలమును కూడ తెలిపి యున్నారు.

ఆ విషయమున తాత్కాలికములగు గ్రహగతులు, గ్రహణాదులు కూడ ఉట్టంకింప బడినవి.

## 3. చంద్రగ్రహణం వివరణ

అందు చంద్రగ్రహణం ఒకటి. అసలు ఈ గ్రహాణాన్ని గురించి ముందు కొంత తెలిసికొన వలసి యున్నది. గ్రహణం ఎలా కలుగుతుంది ? అనేది ముఖ్య అవసరం.

సిద్ధాన్త జ్యోతిశ్శాస్త్రాలలో దీని విషయం విపులముగా వున్నది.

సాధారణముగా ప్రతి నెలకు నొక పూర్ణిమ ఉంటుంది కదా ! పూర్ణిమకు పూర్ణిమకు చంద్రుడు సూర్యునకు ఆరు రాసుల దూరంలో వుండగా వీరికి రాహుకేతువుల సంబంధం కలిగితే గ్రహణం సంభవ మవుతుంది. ఆ విధంగా దాదాపు చంద్రునకు సంవత్సరానికి పది చంద్రగ్రహణాలైనా కలిగే అవకాశమున్నది. సూర్యునికి చంద్రునకు యీ వ్యత్యాయం మాసం మాసం వస్తుంది. కనుక.

## 4. దృగ్గోచరం

ఈవిధంగా కలిగే చంద్రగ్రహణం కలిపించిన ప్రదేశంలో మరల ఆరుమాసాలలోగా తనుపించే అవకాశము లేదు.

సూర్యగ్రహణ మైనా, చంద్రగ్రహణ మైనా ఒక పర్యాయం దేశంలో కనిపించితే మరల ఆదేశంలో ఆరు

మాసాల తర్వాతనే కనిపించవలసి వుంటుంది. అందుచేత మన దేశానికి సంవత్సరం మొత్తంమీద సర్వసాధారణంగా రెండు చంద్రగ్రహణాలు, రెండు సూర్యగ్రహణాలు లేదా సూర్య గ్రహణం ఒకటి కనిపించవచ్చును. మనకు సాధారణంగా అదే విధంగా కనిపించుతవి. అంతేకాని మొత్తంపూర్ణిమలకు, మొత్తం అమావాస్యలకు గ్రహణములు కనిపించుటకు యెంతమాత్రం అవకాశము లేదు. రాహుసంబంధమును బట్టికూడా ఇదే ఫలితాంశం. ఈ గ్రహణాలు చాలరకములుగా నుండును.

గ్రహణములు దిక్కులను బట్టి పూర్ణగ్రహణము, ముక్కాలు, వీసము, అర్ధగ్రహణాలు, పాదగ్రహణము ఇట్టి భేదములతో కృష్ణ, నీల, రక్త, సువర్ణాదిఛాయలు, కపిలాది వర్ణములు బింబములందు ద్యోతకమగుచూ విశిష్టమైన విశేష ఫలములను దేశమునకు కలుగజేయుచుండును. సూర్య గ్రహణమున కృష్ణవర్ణము మాత్రమే కనిపించును.

## 1. (ఎ) గ్రహణం వివరములు

1. గ్రహణముల కక్షలు :—

భూమికి సూర్యుడు 6, 84, 156, యోజనముల యెత్తున యున్నాడు. చంద్రుడు 50, 43, 400 యెగువన కలడు.

గ్రహణం కనిపించే లక్షణం : (శాస్త్రంలో)

శ్లో॥ స్వచ్ఛత్వాత్ షోడశాంశోపి
గ్రస్తశ్చంద్ర స్యదృశ్యతే।
లిప్తాత్రయ మపిగ్రస్తం
తీక్ష్ణత్వాన్న వివస్వతః॥

తాత్పర్యము :

చంద్రగ్రహణము 16 వీసములలో ఒక వీసపాలు గ్రహణము పట్టిననూ కనిపించును. సూర్యగ్రహణము తీక్ష్ణ రశ్మియగుటచే 3 వీసములు పట్టిననూ కనిపించుట కష్టమేను. అనగా పాతికపాలు గ్రహణము పట్టితేనే కనిపించునని భావము.

సూర్యబింబముయొక్క మధ్య

| | | లి | విలి |
|---|---|---|---|
| వ్యాసలిప్తల ప్రమాణము | – | 32 | 00 |
| చంద్రబింబ ప్రమాణము | – | 31 | 24 |
| భూబింబ ప్రమాణము | – | 83 | 24 |

ఈప్రమాణములు గ్రహణకాలమున స్ఫుటములు చేసికొనవలయును. ఆస్ఫుటము వలన అప్పటికి వుండు బింబ ప్రమాణము తెలియ గలదు. ఇట్లుకాగా-

## 2. గ్రహణమనగా నేమి?

శ్లో॥ రాహుఃకు భామండల గశ్శశాంకం
శశాంకగః ఛాదయతీ న బింబం।

తమోమయశ్శంభు వరప్రసాదా
త్సర్వాగమానా మవిరుద్ధమేతత్॥

తాత్పర్యము :

భూచ్ఛాయారోపితమైన తమస్సు చంద్రుని కప్పుచున్నది. అదేవిధముగ చంద్రబింబ గతమైన తమస్సు సూర్యుని గప్పుచున్నది. ఇదియే గ్రహణమునకు యథార్థ లక్షణము.

## 3. చంద్రసంపూర్ణగ్రహణం

ఆధ్యాత్మిక విషయంలో బహుచంచలమైన ఈ మనస్సు మాతృస్వరూపము. అనగా లక్ష్మీస్వరూపం. లక్ష్మి కూడ చంచలమైనదేకదా ! హృదయ గతుడైన జీవుడే సూర్యుడు. ఈతడు నారాయణ (విష్ణు) స్వరూపం. వీరి ఉభయుల సమైక్యం.

జగత్సృష్టికి కారణం ఇది మహానందరూపం. అనగా చంచలమైన మనస్సును నిశ్చలంగా ఆత్మస్వరూపమైన పర మాత్మతో విలీనం చేసి హృదయ కోశంలో మహాయోగులు దర్శించే బ్రహ్మదర్శనం అన్నమాట. ఇదియే తత్త్వవేత్తలకు మహానందం. ఈస్థితి ఆత్మయందువలె ప్రత్యక్ష సూర్య చంద్ర

బింబములలో ప్రపంచ నిదర్శనముగా చూచుట ఆనందంగాక యేమౌతుంది.

"చంద్రమేకసమం విష్ణుం
చంద్రమేక సముద్భవం।
చంద్రసూర్య సమంవందే,
చంద్రజ్యోతి మయోమయి॥"

అనికూడ మరలబ్రహ్మముగారు చెప్పినారు.

తనగీతికలో "భాను బింబమందు విష్ణురూపమునుజూచి భక్తులు సంతోషమయ్యేరమా!" పూని పౌర్ణమినాడు అమావాస్యఅయ్యేని—పూలవర్షమూలు కురిసేనిమా !
అనికూడగీతం వ్రాశారు బ్రహ్మంగారే.

## ఎరుక

ఇప్పుడు ఒక సంపూర్ణ సూర్యగ్రహణంలో చంద్రుడు మునిగిపోగా కంకణ గ్రహణము కలిగి అమావాస్యనాడు చంద్రోదయంకలిగినది అనేవిషయాన్ని మరియు యోగ దర్శనము ఈరెంటిని తెలిసికొని యుంటిమి. ఇవి యేమిా తెలియని వారికి కూడ యెరుక అవుతుంది ప్రత్యక్షంలో.

## 4. అమావాస్య చంద్రోదయం

అమావాస్య సంపూర్ణసూర్యగ్రహణమై బింబమంతా

ఛాయతో కప్పబడినప్పుడు ప్రపంచములో పగలే నల్లని చీకటి ఆవరించి పగటియందే చుక్కలు కనిపించుట కూడ అందరకు తెలిసిన విషయమే.

కాలజ్ఞానంలో :- "పగలు నక్షత్రములు అగుపడును" అనికూడ తెలిపియున్నారు. ఇదికూడ బహుఆనందదాయక మగు విషయమగుటచేత శ్రీబ్రహ్మంగారు పై విధముగా వ్రాసినారు. అందుచే అణురూపమైన నక్షత్రములవంటి జ్యోతిని పగలే దర్శించగలముగదా! వేదంలో ఈ విషయాన్ని "పీతా భాస్వత్యణూపమా" అనిచెప్పినారని కూడా అణుస్వరూపుడగు విష్ణుదర్శనం ఈవిధంగా కల్గుతుంది అనే నిదర్శనాన్ని తెలియ పరచినాడు. ఇట్టి విష్ణుదర్శనం సర్వప్రాణి కోటికి ఆనంద దాయకం అన్నమాట.

ఈగ్రహణాన్ని గురించి ఇచట వ్రాస్తూ 1932-12-30 తేదీన పట్టిన చంద్రగ్రహణం మనరామరాజ్యము ఇదే సమయాన జరుగగలదనే నిర్ణయమునకు భవిష్యత్తును ప్రత్యక్ష నిదర్శనముగ గ్రహణములను ఉదాహరించినారు అన్నది సారాంశం. అందుచేత నేటి రామరాజ్యం బ్రహ్మంగారు తెల్పినారని తాత్పర్యం. ఇక ముఖ్య విషయమునకు వద్దాం.

జ్యోతిశ్శాస్త్రంలో వుండే సూర్య చంద్ర గ్రహణాల చర్చను బ్రహ్మంగారు యీకాలజ్ఞానంలో దేనికి ప్రస్తా

వించారు? అనేది ముఖ్యప్రశ్న? చెప్పుచున్నాను శ్రద్ధగా వినండి!

## అవతారం

మన భారతదేశంలో దైవారాధనము ధర్మాధర్మ నిర్ణయముల శాతం హెచ్చు. దీనికి మూలం వేదం. ఇది భారతీయులసొమ్ము. అయిననూ మనదేశ శాస్త్రిలను మనము చదువుటను మానుకున్నాం. పెరటిదొడ్లో మొక్కను మహౌషధీ విలువను వదలినట్లు. ఇతర దేశములవారు మన వేదాలను చదివి విమర్శించి మనకంటె కూడా ఎక్కువ విజ్ఞానాన్ని సంపాదించుకొన్నారు అనేదాంట్లో అసత్యమేమీలేదు. వేదశాస్త్రిలు, భక్తివైరాగ్యాలు, వేదాంత పరిజ్ఞానముగల ఈదేశంలో ధర్మానికి ఎప్పుడు విఘ్నంకలిగితే అప్పుడు ధర్మరక్షణకోసం "పరమాత్మ" యేదో ఒక అవతారమెత్తి అచటగల దుష్టత్వాన్ని నశింపజేసి ధర్మరాజ్యాన్ని నిలబెట్టుననుట భారతీయ సంప్రదాయం. అందుకే గీతలో "ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" అని అన్నాడు కృష్ణ పరమాత్మ.

## నేటిస్థితి

నేడు మన భారతదేశానికి అట్టి దుస్థితే పట్టింది "రాజ్యమే అధర్మరాజ్యమైనది. అందుకే ధర్మరాజ్యం నిలిపే

నిమిత్తం "రామరాజ్యం" మన తెలుగుదేశానికి కావలసి వచ్చింది. అత్యంతము-.

దైవసంకల్పముగా నేడు రామధర్మజమూర్తి మహిమ ప్రజ్వరిల్లి "రామరాజ్యం" యేర్పడింది. ఈరామరాజ్యాన్ని కాలజ్ఞానంలో బ్రహ్మముగారు తెలిపిన విషయాలకోసమే "కాలజ్ఞానములోని అద్భుత మహిమలు" అనే గ్రంథం నేడు వెలుగులోకి రావలసి వచ్చింది. ఇదిరామరాజ్యం.

ఈరామరాజ్య బీజాలుగా సూర్యగ్రహణము కార్తీక అమావాస్య 1982-12-15 నాడున్నూ, 1982-12-30 తేదీన సంపూర్ణ చంద్రగ్రహణము కలుగుటను కూడ యీ రామ రాజ్యమునకు హేతుభూతములనే ఆశయముతో బ్రహ్మంగారు మునుముందుగనే భవిష్యత్తును వ్రాకుచ్చినారు.

ఇప్పుడు వీటి విషయాలను పరిశీలించుదాం.

## చంద్రగ్రహణ నిర్ధారణ

దుందుభి-మార్గశిర పూర్ణిమ. 30-12-1982

శకము - 1904

కల్యాది - 5082

ప్రకారం 1982-12-30వ తేదీకి సరియైన స్వస్తి శ్రీదుందుభినామ సంవత్సర మార్గశిరశుద్ధ పూర్ణిమా గురువారం, సంపూర్ణ

చంద్రగ్రహణము. రాహుగ్రస్తము, పింగళవర్ణము. ఆగ్నేయ దిక్ స్పర్శము, నైరుబుతి దిక్ మోక్షము.

గ్రహణకాలము

| | ఘ | - | వి | గం. | - | నిమి |
|---|---|---|---|---|---|---|
| సూర్యోదయాది స్పర్శకాలం | -౨౧ | - | ౪౪ | 3 | - | 22 |
| మధ్యకాలము | -౨౬ | - | ౦౨ | 5 | - | 02 |
| మోక్షకాలం | -30 | - | 2 | 6 | - | 38 |

బ్రహ్మముగారు చెప్పినట్లు ఈగ్రహణము

శ్లో॥ అస్మిన్ శ్రీశైల దేశేతు కంకణాకార ముచ్యతే।
శేషాద్రీ గౌతమీ మధ్యే ఉదితోది విదృశ్యతే॥

అన్నశాస్త్ర సారాంశం. ఆగ్నేయ దిక్కైన రాజమండ్రి, కాకినాడప్రాంతంలో గ్రహణారంభమయి నైఋతి ప్రాంతమైన శ్రీశైల మహాక్షేత్రాల్లో మోక్షము సంభవించుటయు మన తెలుగు దేశమునందు పూర్తిగ స్పష్టముగ కనిపించుటయు విశేషము.

## 6. సూర్యగ్రహణం 15-12-1982

దుందుభి కార్తీకమాసం. సిద్ధాంతీకరణ ఇక సూర్య గ్రహణముకూడా.

ఇదే దుందుభినామ సంవత్సర కార్తీక బహుళ అమావాస్యా బుధవారమునాడు మన దక్షిణ భాగమున గాక మనకు ప్రధాన రాజధానియగు డక్కన్ హైదరాబాద్ నుంచి ఢిల్లీవరకు కూడా స్వల్పముగ కనిపించినది.

తెలుగుదేశములో కనిపించదుకనుకనే ఈ గ్రహణం శ్రీశైల దేశానకు శూన్యమైనది. అని వ్రాసి నేటికాలమున (రామరాజ్యప్రారంభ) వచ్చిన ఈరెండు గ్రహణముల భవిష్యత్తును తానే నిర్ధారణచేసినాడు. కనుకనే నేడీ గ్రంథమున వ్రాయుటకునూ రామరాజ్యస్థాపనకు కూడా ఈ గ్రహణముల కాధారమైన వాక్యములే మూలకారణములు అయినవి.

## 2. పూర్ణిమ అమావాస్య

కాలజ్ఞాన మూలం :

"భాను బింబ మందు విష్ణురూపము చూచి
భక్తులు సంతోషు లయ్యేరుమా
పూని పౌర్ణమినాడు అమావాస్య అయ్యోని
పూలవర్షములు గురిసేనిమా"

## 3. అమావాస్య పున్నమ

కాలజ్ఞాన మూలం :

అమావాస్య పున్నమ జూచి
నాశనమై పోయేరు.

# అమావాస్య చంద్రోదయం

**కాలజ్ఞాన మూలం :**

సామవేద ఘోషణల చేత
బాల్య యౌవన ప్రౌఢలు
వీరభోజ వసంతరాయల చరిత్రాలు పాడేరు
పువ్వులవాన గురిసేని
ఆ మీదట చంద్రోదయ మయ్యేని

**తాత్పర్యము :**

ఒక అమావాస్య పర్వమున సంపూర్ణ సూర్యగ్రహణము పట్టుచో నాటి అమావాస్య గడియలలోనే గ్రహణ స్పర్శము మోక్షము కూడా కలుగును. చంద్ర సంపూర్ణ గ్రహణమున పూర్ణిమా పర్వ గడియలలో మోక్షము కలుగును. ఇది సిద్ధాంత శాస్త్ర సంప్రదాయము. అందుచేతనే బ్రహ్మముగారు అమావాస్యనాడు చంద్రుడనియు హెచ్చరించినాడు.

అమావాస్యనాడు చంద్రుడు కనబడుట యెట్లు ?

చంద్రబింబము సూర్యబింబము కంటె తక్కువగుచో కంకణ గ్రహణము కలుగును.

# శాస్త్రము

శ్లో॥ అర్కబింబా చ్చంద్ర బింబ మల్పం
క్షేపస్య శూన్యతా ।
పరితః కంకణాకార మర్క
బింబం ప్రదృశ్యతే ॥ సూ॥సి॥సం

సూర్యబింబము పెద్దది. చంద్రబింబము చిన్నది. కనుక సమానముగ బింబమధ్యమును చంద్రబింబము చేరినచో పెద్దదైన సూర్యబింబము వలయాకారముగ కనిపించును.

(ఇదియే అమావాస్యనాటి చంద్రోదయము)

కంకణ గ్రహణమున సూర్యబింబము వలయాకారముగ కనుపించును. ఈ విధముగ కంకణ గ్రహణము సంభవించును.

భారతదేశములో యోగదృష్టి గల పురుషులకు ఈ కంకణ గ్రహణము తమకు ఆత్మదర్శన మైనటుల భావింతురు. అందుచే యోగదృష్టిగల వారు (అమావాస్యనాడు చంద్రోదయమైనది అని) ఆంతరంగిక ముచ్చటను వెలిబుచ్చుదురు.

కనుకనే బ్రహ్మముగారు కాలజ్ఞానంలో 5వ పేజీలో అమావాస్యనాడు చంద్రోదయ మయ్యీని అనినాడు. దీనినే మరల అమావాస్యనాడు చంద్రుడు ఉదయిస్తున్నమరుగు అని

కూడ చెప్పినాడు. ఈ మాటలోని మనుగు అన్నదానికి అర్థం ఏమిటి అని అంటే వేదంలో "సయ ఏషోం తర్హృదయ ఆదిత్యః" అనియును శ్రుతి ఘోషించుచున్నది.

హృదయాంతర్గతుడైన ఆదిత్యరూప పరమాత్మయందు మాతృరూప మనస్సు లీనమై ఆనందించి తన్మయత చెందునని భావము.

## 4. పూర్ణిమ మహిమ

### కాలజ్ఞాన మూలం :

పున్నమ మహిమ
కలి దోషకాలమెల్లా
ఈవేళ పున్నము వరకు
కానయాచి
అంబీజ మహిమచే
సప్తాశ్వభాస్కర సాక్షిగాను
సూర్య నందీశ్వరుని
సన్నిధానము నందు
పున్నమ దినం.

### తాత్పర్యము :

పైన పేర్కొనిన విషయమును తాను తపోనిష్ఠుడై

అంబీజ స్వరూపమైన బ్రహ్మజ్యోతిని దర్శించుటకు కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యము లనబడే అంతర్గత మైన అరిషడ్వర్గమును అధిగమించి సుజ్ఞానఘనమనే సప్తాశ్వము ద్వారా ఏకాక్షరరూప ప్రత్యగభిన్న బ్రహ్మానంద నిలయ వినిర్గత దివ్యజ్యోతి దర్శనమును, తాను ఈశ్వర స్వరూపుడై జ్యోతిర్నిర్గత ప్రభాభాసమాన సమానరూపుడైన నందీశ్వరు డన బడే జీవపశురూప అజ్ఞాన నిర్గళిత దివ్యజ్ఞానరూప ఆత్మ సాక్షిగా, స్వయం వ్యక్త సంపూర్ణానంద జ్యోతిని దర్శించు చున్నాను. అని లోకమునకు ఈ పూర్ణిమ మహిమ ఈ కంకణ గ్రహణాదుల ద్వారా అందరుకూడా విలోకనము చేయవచ్చు ననెడి సర్వసమత్వభావనమును ఇచట నిరూపించినాను బ్రహ్మముగారు.

## 4 ఏ. సంపూర్ణ చంద్రగ్రహణం

(దిన పత్రిక నుండి)

కలకత్తా,
డిశంబరు 31 1982.

రెండువేల ఏళ్ళ తరువాత పదకొండోమారు సంభ వించిన సంపూర్ణ చంద్రగ్రహణాన్ని దేశంలోని అసంఖ్యాక ప్రజలు నిన్న కన్నుల పండువుగా తిలకించారు.

సరిగా నిన్న సాయంత్రం 4-58 గంటలకు చంద్రోదయ

సమయంలో సంభవించిన గ్రహణం 6-37 గంటలకు విడిచిందని అంతరిక్ష పరిశోధనా సంస్థ తెలిపింది. మళ్ళీ మరో సంపూర్ణ చంద్రగ్రహణం 2485 వ సంవత్సరములో సంభవిస్తుందని పరిశోధకులు అంటున్నారు.

దీని ప్రకారం ఇటువంటి చంద్రగ్రహణం ఇక 503 సంవత్సరములకు కలుగును.

## 5. రామధర్మజమూర్తి ఉద్భవం

### [1] వీరోదయం

కాలజ్ఞాన మూలం :

శ్లో॥ ఇదం రహస్యం తద్రూపం
దృష్ట్వా వీరోదయం భువి ।
యూయ యమిత్యేవ పుణ్యాత్మా
జ్ఞాత్వా శ్రీ వీర ధర్మజ ॥

తాత్పర్యము :

పై కాలజ్ఞాన వచనంలో అతి రహస్యమైన అర్థము ఇమిడి యున్నది. పై శ్లోకానికి అర్థము చెపుతూ ఈ గ్రహణము కలిగిన భూమి యందు "వీర ధర్మజుడు" ఉద్భవ

మయ్యేరు అని వ్రాసినారు అంటే నేటి రామరాజ్యాధినేత అయిన శ్రీ రామధర్మజమూర్తిగారు బ్రహ్మంగారి అంశ సముద్భవుడే ననేది నిశ్చయం. ఎందువల్లనంటే —

-: మంత్ర రూపం :-

శ్లో॥ మాంశం మాంశం మహాః ।
రామం రామం రామమే కోమయేవా ॥

అని ప్రస్తావించి రామధర్మజమే మయం అని అన్నారు.

-: దీని వివరణ :-

నా అంశ స్వరూపుడైన వీరుడు రామ నామాంకితుడై ధర్మ ప్రతిపాదితంబగు రాజ్యాన్ని స్థాపించగలడు, అని నిశ్చయార్థము దేశం తెలుసుకోవాలి.

## [2] పుష్పవర్షములు

### కాలజ్ఞాన మూలం :

శ్రీరామ ధర్మజులు సృష్టి భారము దాల్చ
శృంగారమూర్తులై వచ్చేరుమా ।
ఘోర దురితము లణగి

కుంభిని మీదను
పుష్ప వర్షములు కురిసీనిమా ॥హరి॥

తాత్పర్యము :

పూర్ణిమ మహిమ "కలి దోష కాల మెల్ల" అని తెలియజేస్తూ సర్వ దేవత్వంబు సర్వము యిచ్చి ఉద్దండ వీర విజయంబు వెలసె అని స్పష్టంగా చెప్పినందున ఈ రామ రాజ్యము నిజమైన రామరాజ్యం కావడానికి కార్తీక శుద్ధ ద్వాదశి నాటికే (28-11-1982) ఉద్భవమయ్యేని. వేద ఘోషణములతో లోకాల కెల్ల వినపడేని. అంతట పూలవాన కురిసేని అని చెప్పియున్నందున రామధర్మజమూర్తి తొమ్మిది మాసములన్నా పూర్తిగాక ముందే అనంత వైభవోపేతు డగుచు అన్ని పట్టణములలోను పల్లెలలోను పూలమాలలతో ముంచెత్తబడినాడు.

## [3] మార్గశిరం మందిరంచేరుట

కాలజ్ఞాన మూలం :

పరమ యోగీశ్వరుల కాలానకు
నదులు మూడు
పంచకి మొకటి

పై మాసాలు పదింటి మీదట
మమ కుమార
మహాత్ప్రకాశమయ్యాని
మలినంబులు మాసీని
మార్గశిర మాసానకు
మందిరము జేరీని.

**తాత్పర్యము :**

వీర దేవత్వంబు విక్రమంబున ఆ దేవతా రూపంబగు మార్గశిరంలో ప్రసన్న మౌతుంది అని అన్నారు.

-: ఇందుకు ప్రమాణం :-

"మాసానాం మార్గశీర్షోహం" అని గీతా వాక్యం ప్రమాణం.

బ్రహ్మము గారు తన కాలజ్ఞాన వచనంలో మమ కుమార మహాత్ ప్రకాశమయ్యాని - మలినంబులు మాసీని- మార్గశిరమాసానకు మందిరము జేరీని అని తెలిపినారు. దీనిని బట్టి రామధర్మజమూర్తి మార్గశిర మాసంలోనే పట్టాభిషిక్తుడైనాడు.

## (4) రామావతారం

### కాలజ్ఞానమూలం

మిగులపదో అవతారంబు
రామరామాత్మ రామావతారంబు ఉద్భవము
అనాది బ్రహ్మవచనార్థములను
బహిర్ముఖములమీద
బహువచనంబున మూర్తిమహిమచే
కల్లకలియుగము పాలుడిగిపోయేను.
భూభారమైన
దుష్టద్రోహులు
నాశనమైపోయేరు
సదోపవాసము నేడే కనిపించేను

తాత్పర్యము :

రామరామాత్మ రామావతారంబు ఉద్భవము కాగానే .... ....
మూర్తిమహిమచే కల్లకలియుగము పాలు దిగిపోయేను "అని కూడ బ్రహ్మముగారు తెలిపినారు. అనగా భూభారమైన దుష్టులు, ద్రోహులు నాశనమై పోయేరు. సదోపవాస రామ రామాత్మ రామ భోగంబులు యిస్తిమి అని అన్నారు.

అన్యాయం చేసేవారు శిక్షింపబడడం ఇందుకు నిదర్శనం.

## (5) దేవతాసార్వభౌముండైన రామావతారం

కాలజ్ఞానమూలం

శ్రీవీరబ్రహ్మయోగీంద్రుడు
వీరవీరత్వము చేతను
దశావతారములు యెత్తి
మరిన్ని దేవతా సార్వభౌముండైన
రామావతారం యెత్తి
ఆనందాశ్రమములకు శిష్యుండనై
అంతర్భవిష్యమంతా
సాంద్రసింధు వేదమేచదివి

తాత్పర్యము :

వీరవీరత్వముచేతను దశావతారములు యెత్తి మరిన్ని దేవతాసార్వభౌముండైన రామావతారము ఎత్తితినని కూడ బ్రహ్మముగారు తెలిపియున్నారు.

అనగా దుష్టశిక్షణ యెచట యేవిధముగ అవసరమగునో అచట ఆవిధమునకు తగునట్లు అవతారము లెత్తుట మహా విష్ణుని స్వభావము. ఇప్పుడిచట ధర్మప్రబోధము నిమిత్తము

సామాన్యప్రజల జ్ఞానోదయ నిమిత్తము నేనీ (వీరబ్రహ్మేంద్రుడనే) రామావతారమును దుష్టసంహార నిమిత్తము ఎత్తవలసి వచ్చినదని అభిప్రాయము.

## [6] రామధర్మజ ఉద్భవవాసం

### కాలజ్ఞానమాలం

కర్తీక శుద్ధ ౧౨ లు నాటికి
ఉద్భవమయ్యేను
ముందరపుట్టే కార్యాలు
వేదఘోషణలు
లోకానికెల్లా వినబడీని.
పువ్వులవాన గురిసీని
ఆమీదట అమావాస్యనాడు
చంద్రోదయ మయ్యీని

తాత్పర్యము :

కార్తీక శుద్ధద్వాదశినాటికి (28-11-1982) ఉద్భవము అయ్యేము. పూలవానకురిసీని. ఆమీదట అమావాస్యనాడు చంద్రోదయమయ్యీని అని తెలిపినాడు. దీనికి తార్కాణము మార్గశిర శుద్ధ పూర్ణిమనాడు (30-12-1982) కలిగిన చంద్ర గ్రహణమే నిదర్శనము.

నేడు యీ దేశమున ప్రచలితమైన దుర్దోషపరిహారార్థం ఒక సన్మార్గాన్ని దేశంలో ప్రవేశపెట్టవలసిన అవసరము యేర్పడినదని భావము.

## (7) రామధర్మజస్వామి ఉద్భవము

### కాలజ్ఞానవాక్యం

రామధర్మజస్వామి రాజీవముఖిగూడి
రాజ్యమెల్లా యేలవచ్చీనిమా
కామజనకు డపుడు
కావేటిరంగనికి
కనకాభిషేకము జేసీనిమా।

తాత్పర్యము :

రామధర్మజస్వామి రాజీవముఖిగూడి రాజ్యమెల్లా ఏలవచ్చీనిమా, అనికూడా బ్రహ్మంగారు తెలిపియున్నారు.

ఇచట చెప్పిన రాజీవముఖి అనగా సర్వవిధములైన అర్థ కామముల ననుభవించి ధర్మరక్షణ నిమిత్తం రామరాజ్యం యేలుటకు రాగలడు అని ముందుగనే తెలిపినారు. అందులో "కామజనకు డపుడు కావేటిరంగనికి కనకాభిషేకము జేసీనిమా" అనికూడా తెలిపినారు.

## (8) రామధర్మజుల ఉద్భవం

### కాలజ్ఞానమూలం

కార్తీక శుద్ధ ౧౨లు నాటికి
రామధర్మజులు ఉద్భవ మవుతున్నారు.

తాత్పర్యము :

బ్రహ్మంగారు మరియొక సందర్భములో కార్తీక శుద్ధ ద్వాదశి (28-11-1932) నాటికి రామధర్మజుడు ఉద్భవం అవుతున్నారుఅనికూడ తెలిపియున్నారు. "ఉద్భవం అంటే" నా అంశతో ఉన్న ఈమహనీయుడు ఇపుడు వ్యావహారికంగా రాజ్యపాలనావిధానంలో అపారమైన విశ్వాసాన్ని, ప్రజాదరణను పొందబోవు చున్నాడని తాత్పర్యం.

## [9] శృంగారమూర్తి

### కాలజ్ఞానమూలం

శ్రీరామధర్మజులు
సృష్టిభారముదాల్చ
శృంగారమూర్తులై వచ్చేరుమా
ఘోరదురితము లణగి

గుంభినీమీదను
పుష్పవర్షములు గురిసీనిమా

తాత్పర్యము :

శ్రీరామధర్మజులు సృష్టిభారము తాల్చ "శృంగార మూర్తులై వచ్చేరుమా" అనికూడ తెలిపియున్నారు. అనగా త్రేతాయుగంలో రాముడు, ద్వాపరయుగంలో ధర్మపరిపాలకుడు ధర్మరాజు, వీరిఉభయులు శృంగార వైభవాలు ఒకేచోట ఒనగూడుతవి అనితాత్పర్యం.

## (10) అమృతవచనం

కాలజ్ఞాన మూలం :

రామధర్మజులుఅనే
అమృతవచనం
రేపేకనిపించీని.

తాత్పర్యం :

రామధర్మజ అనబడే శబ్దనిర్వచనము అది అమృతప్రాయమైనది. అమృతం, అఖండక్షీరసాగరాన్ని దేవదానవులు మధిస్తే, ముందుగా హాలాహలాదులు పుట్టి చిట్టచివరకు దివ్యభోజ్యమైన "రామరాజ్య" నామం కూడా రామధర్మజ శబ్దంతో వ్యవహరింపబడే ఈ ఒక మహామహుని

రూపంతో లేచే, దివ్యమైన ఒకానొక ముహూర్తంలో ఆవిర్భవించ బోవుచున్నది. దాని నిమిత్తం మనమందరము ఓపికతో ఆ క్షణము కొరకు నిరీక్షించి చూడాలిసుమా” అని మనకు యెరుక చేస్తున్నాడు బ్రహ్మముగారు.

## (11) కాలపరిపక్వము-బాలచంద్రునికాంతి

### కాలజ్ఞాన మూలం :

కాలపరిపక్వము
జనులాకుముందర
కార్తీక మాసములో
కలిగీనిమా
బాలచంద్రునికాంతి
కానకబోయ్యాని
భానుకాంతులణగి
పోయేనిమా।

తాత్పర్యము :

దేశంలో (భారతదేశం) యెచ్చటయేని దుర్మార్గం ప్రబలినప్పుడు దానిని అణగించే నిమిత్తం యేదోఒక అవతార పురుషుడు ఒక కాలానికి రావలసియేఉంది. అదేవిధంగా ఆనాటి ప్రజలకు తన కాలజ్ఞానంలో కార్తీక మాసంలో

కాల పరిపక్వం జరుగుతుంది. తన్మూలకంగా దుర్మార్గశక్తి (అణగి)నశిస్తుంది అని వ్రాస్తున్నాడు బ్రహ్మంగారు.

## [12] సామగాన ప్రియుడు

### కాలజ్ఞాన మూలం :

మందార ధరుడైన
సుందరాంగుని మహిమ
మహిమీద యెవరూను
యెరుగారుమా!

సందేహము లేదు
సామగాన ప్రియుడు
సాధూలరక్షింప వచ్చీనిమా !

తాత్పర్యము :

మందర ధరుడైన సుందరాంగుడనగా శ్రీమహావిష్ణువు. అతని మహిమ అంటె "విష్ణుమాయ". అట్టి విష్ణుమాయను లోకంలో యెవరికి తెలియదనడంలో సందేహంలేదు. అటువంటి మహావిష్ణువే సామగానప్రియుడు. అంటే సంగీతలోలుడు మురళీకృష్ణుడు– లేక నారదాది మహర్షిస్తోత్రప్రియుడు – నేడు సాధువులందరను రక్షించు నిమిత్తం రాగలడు అని తాత్పర్యం.

బ్రహ్మముగారు తన కాలజ్ఞాన రచనలో పైన తెల్పిన పంద్రెండు అంశములలో రామధర్మజుల ఉద్భవమును గురించి తెలిపియున్నారు. ఈఉద్భవమునకు కార్తీకమాసము శుద్ధ ౧౨లు మార్గశిర మాసములు హేతువులుగా తెలిపియున్నారు. మరియు మార్గశిర శుద్ధపూర్ణిమనాటి చంద్రగ్రహణ హేతువు ఈ రామధర్మజుల ఉద్భవమునకు ముఖ్యకారణమై యున్నది.

## 6. రామధర్మజమూర్తి స్వరూపాలు

### [1] రామభోగము

కాలజ్ఞాన మూలం :

సన్యాసి వేషంబు సరిపోయె
చతుర్దశి వెళ్ళినమీాద
ఆమీాద మరియు
నాద బ్రహ్మము
నాకుమారుని చేసి
నాయాత్మ పుత్రుగనుక యిస్తిమి
రామాత్మ రామభోగంబులు యిస్తిమి

తాత్పర్యము :

భగవదంశలో మత్స్యకూర్మాది అవతారములన్నియు భగవత్స్వరూపాలే కనుక ఇప్పుడీ రామరాజ్యస్థాపనకు రాబోయే పురుషునకు ముందుగా నాలీలా విలాసరూపంబగు నాదబ్రహ్మోపాసనా మయమై చిద్విలాస నాటకాన్ని నాసన్యాసి వేషంతో అనుభవింపజేసి పిమ్మట రామాత్మ రామభోగరాజ్యాన్ని ప్రసాదిస్తున్నానని చెప్పినాడు బ్రహ్మముగారు.

## [2] సర్వనాటకధార

కాలజ్ఞాన మూలం :

ఆ పురుషోత్తముని
మహిమలు
అంతంతయు
ఆదిశేషుని
భోగభాగ్యాల మీద
సాక్షాత్తు
రామధర్మజమూర్తి
ఉద్భవము, సర్వాత్మ, సర్వేశు
సర్వనాటకధారి,

కల్ల కలియుగము
పాలుడిగిపోయెను.

తాత్పర్యము :

బ్రహ్మంగారు రామధర్మజమూర్తిని సర్వాత్మ, సర్వేశు, సర్వనాటకధారిగా పేర్కొని యున్నారు. దీనికి ఉదాహరణగా శ్రీరామచంద్రమూర్తి పురాణగాథ పేర్కొనబడు చున్నది.

దశరథ మహారాజు అంతటివాడు దైవాంశ సంభూతుడు అయిన తన కుమారునికి యౌవరాజ్య పట్టాభిషేకం చేయాలని తలపెట్టినాడు. వసిష్ఠుని వంటి త్రికాలజ్ఞుడు ముహూర్తం కూడా నిర్ణయించినాడు. ఐతే దైవసంకల్పంలో శ్రీరాముడు రాక్షసవధ నిమిత్తం జన్మించిన అవతార పురుషుడు గనుక - ఆ దైవీశక్తియే "కైకేయి" రూపములో శ్రీరాముని నిత్యమైన రాజ్యాభిషేకం అయోధ్యలో జరుగకుండా అడవుల పాలుచేసింది. అదే విధంగా ఇప్పుడీ రామరాజ్యం కూడా మొత్తం భరతఖండానికి సంబంధించినది కాకపోయినా యీ దేశానికైనా (ఆంధ్రప్రదేశ్) కాలు నిలదొక్కుకొని సర్వ సమస్యలు సర్వ వ్యవహారములు సాఫీగా జరుగవలసి వున్నది.

శ్రీరాముడు దేవుడే అయినా తాను సామాన్య మానవునివలె ధర్మప్రవర్తనమునకు కట్టుబడి నేనే రాజును

కదా ! అనే అహంభావము యెంత మాత్రము హృదయ కోశములోనికి జొరనీయక సర్వాత్మ నా సర్వేశ్వరుడే అయి సర్వనాటక సూత్రధారియే యైనను రాజకీయ రంగంలో కూడ సామాన్య మానవుడే అయి ప్రజలకు ధర్మప్రబోధం ఆచరణ రూపంలో చూపించాడు. వాచా ప్రసారం చేయకుండానే ధ ర్మ మా ర్గ ం లో నడిచాడు. రాముడు ప్రజలలో కలిసి సామాన్య మానవుని వలె ధర్మాన్ని ఉపదేశించ కుండా నడ వడిలో చూపాడు.

ఇప్పుడీ నా ట క ధా రి (రామధర్మజమూర్తి) కృష్ణావ తారంలోవలె తాను వేరు, ప్రపంచం వే అంటూ విశ్వ రూపాన్ని చూపిస్తూ సర్వ దుష్టశక్తులను తానొకడే స్వయంగా కాకుండా అధికారవర్గంతో గూడ తన, మన అనే విషయం లేకుండా దు ష్ట త్వా న్ని నిర్మూలించడానికి కంకణం కట్టు కున్నాడు. ఐనా కృష్ణుని వెనుక కంసుని వంటి వాళ్ళు లేక పోలా వారిని జాగ్రత్తగా కనిపెడుతూనే వుండాలి.

## [3] సన్యాసివేషం - సంతోషము

### కాలజ్ఞాన మూలం :

సన్యాసి వేషంబు
సంతోషము మీద

సాక్షాత్తు
రామధర్మజమూర్తి
ఉద్భవము.
సర్వాత్మ,
సర్వే సర్వనాటకధారి
సదోపవాసంబు
విడిపించి
భోంచేయ
కట్టడి చేస్తిమి.

తాత్పర్యము :

సన్యాసి వేషంబు సంతోషముల మీద సాక్షాత్తు రామధర్మజమూర్తి ఉద్భవమనియు మరియు సర్వనాటకధారి యని కూడా బ్రహ్మంగారు తెలిపియున్నారు.

ఇచట మరల తెలుపుటలో నా గ్రంథం, నా రూపం, నా నటన, అన్నియూ నా యానతిన కలిగినవే అని తెలిసి కోవాలి.

## [4] విభూతి తిలకం

### కాలజ్ఞాన మూలం :

వీరభోగ వసంతరాయలుండే

క్రమం చెప్పెను.
సువర్ణచ్ఛాయ బోలిన వారు
విభూతి తిలకం
ధరించిన వారు.

తాత్పర్యము :

ధర్మరాజమూర్తి వుండే క్రమం తెలుపుతూ సువర్ణఛాయ బోలినవారు విభూతి తిలకం ధరించి వుండగలరని కూడ తెలిపి వున్నారు. ఈ మహర్షికి విభూతి తిలకాన్ని ప్రసాదించి ప్రజల లోకి పంపారు మన బ్రహ్మంగారు.

## [5] సన్యాసివేషము

### కాలజ్ఞాన వచనం :

పర్వతంమీద
ఆరామ
భోగభాగ్యము మీద
సన్యాసి వేషంబు
సర్వంబు ముగిసెను.
శంఖుచక్రంబు
ఘనత యిచ్చె.

తాత్పర్యము :

బ్రహ్మముగారు తన నాటకాన్ని యీ రామధర్మజ మూర్తి ద్వారా లోకానికి తన వేషం వేయించి సన్యాసాశ్రమం వంటి సద్విషయాలను ప్రబోధింప జేయుటయేగాక ఆచరణలో కూడా పెట్టి తానే బ్రహ్మముగా ప్రతిపాదించి పిమ్మట ఈ రామరాజ్యంలోకి దింపారు. పర్వతం మీదనే వేషంకూడా మగిసింది. అంటే? బ్రహ్మముగారి నాటకాలు వేస్తున్న వాళ్ళ లోకంలో ఎంత మంది ఉన్నారు? వారందరికి బ్రహ్మం గారి ప్రభావం ఆపాదించినదా? వారందరు ఇతరత్రా యేమైనా ఘనకార్యం చేయగలిగినారా? ఆ నాటకం వేసే కాసేపు కూడా నిజమైన బ్రహ్మంగారి భావనను మనకు చూపలేనివారే ఎక్కువ మంది ఉన్నారు. ఇపుడే "రామరాజ్య నేత" తాను స్వయంగా బ్రహ్మత్వాన్ని పొంది ఆ భావమనే పర్వతం మీద ధ్యానయోగంతో తన శక్తిని దేశానికి చూపగలుగుతున్నాడు.

## 7. రామధర్మజుల ఆశయము

కాలజ్ఞాన మూలం :

రాజ్యములెల్లా
రేపే యేలేరు.

నాంది నాంది అనే
సూర్య నందిన్నే
ప్రకాశమయ్యేము.
పౌర్ణమాస్యమాయెను,
మాంశం, మాంశం, మహాంశమే
సర్వతో మహా
మహామ కోమ యేవ
రామం రామం
రామమే కోమయేవ
రాజ్యం, రాజ్యమే కోవయేవ
సేవ్యం, సేవ్యం,
సేవ్యమే కోవయేవ
దూష్యం దూష్యం
దూష్యమే నాశయేవ
ధర్మం, ధర్మం
ధర్మయే నర్థయేవ
బ్రాహ్మ్యం బ్రాహ్మ్యం
బ్రాహ్మమే కోవయేవ
త్రైలోక్యమేక మేరాజ్యం
రామధర్మజమే మయం.

తాత్పర్యము :

"రామరాజ్యమునకు ప్రధానవ్యక్తి శుభసూచకమైన నాంది పలుకుతూ అనగా ఆనందరూపమైన 'దేశ ప్రజల సౌఖ్యాలు, మేంచూస్తాం' అనటమేనాంది. సర్వప్రకాశస్వరూంప మైన పున్నమనాటి చంద్రకాంతి వంటి కీర్తి మయూఖములను వెదజల్లుతూ "రామరాజ్యమనే" కీర్తిసాగరంలోకి ప్రవేశిస్తాడు. అలా ప్రవేశించ గలగటానికి హేతువేమి ? అని ప్రశ్న. ఇదిగో చెప్పెద వినండి.

మాంశం :- ఇది ఒక మంత్ర రహస్య రూపమైనా )వరిస్తున్నా, "మా" అనగా లక్ష్మి, "శం" అనగా శాంతి )జం, (లోకం) దేశంలో అలజడి ఎక్కువైనప్పుడు, శాంతి )మిత్తం భగవానుడు ప్రసన్నుడై ప్రయత్నాన్ని జరుపుతాడు. దేశశాంతిని కోరుట, తన్నిమిత్తం ప్రయత్నించుట ఇచట ప్రధానాంశం. ఇక రెండవది. "మే, అంశం, మాంశం" అని ఇతడు స్వయంగా నా అంశను పొందియున్న వాడే కనుక ాంశం అని నేనే ముమ్మాటికి వక్కాణించి మీకు తెలుపు ున్నా అని ఇందులో మా అనే అక్షరం మంగళకరమై శం ంటే శాంతిని నెలకొల్పునట్టి దివ్యమంత్రరాజం. దీనిని ఎవరు పించినా వారికి "శమే సర్వతో మహాః" నా అనుగ్రహము ేత అందరికి సర్వైశ్వర్యాలు కలుగుతవి. "మహాః" మహా

నులారా ! వినండి. నా మంత్రం "రామం రామం రామమే
"మయేవ" శ్రీరామ మంత్రంతో సమానం అనగా నా
ంత్రం కూడ అట్టిదే ? మా మంత్రాలకు భేదం లేదు. ఈ
ంత్రం జపించిన వారికి మమ్ము సేవించిన వారికి, ఎంత బీద
ాడైననూ రాజ్య పదవి లభిస్తుంది. అఖండ సౌఖ్యాన్ని
ొందుతాడు. సర్వధర్మాలు నెరవేరుతవి. అని అంటూ ఈ
ంత్రాన్ని దూషించే వారికి సర్వనాశనం కలుగుతుంది. అని
ిన పెట్టాడు బ్రహ్మంగారు. నా అంశ స్వరూపుడైన వీరుడు
ామనామాంకితుడై ధర్మప్రతిపాదితంబగు రాజ్యాన్ని స్థాపింప
లడు. అని నిశ్చయార్థం - దేశం తెలుసుకోవాలి.

## 8. ఆశయసిద్ధి కొరకు సంచారం

### 1 తారలు రాలుట

ాలజ్ఞాన మూలం :

వారాధు లింకీని
వసుధ పాడయ్యాని
తారాలు భువి మీావ
రాలీనిమా
వీరాధివీరుల

వెంట బెట్టుకొని
వీర వసంతుడు
వచ్చీనిమా !

తాత్పర్యము :

ఎంతటివాడైనా సమయం కొరకు ఎదురు చూడాలి. భగవంతు నంతటి వాడైనా సమయం రానిదే తన శక్తిని విజృంభింప చేయలేడు. అందుచేత దేశక్షేమమే ప్రధానాశయంగా పెట్టుకొనిన యీ మహామహుడు తనతో పాటి వీరాధి వీరులను వెంటబెట్టుకొని కార్యసిద్ధికి ఉపక్రమిస్తాడు. ప్రతి కక్షశక్తులు ప్రబలంగా విహరించి సముద్రాలై ఇంకేటట్లుగా చేస్తవి. అయినా ప్రమాద మేమీ ఉండదు. కాదగిన కార్యాన్ని గంధర్వులే తీరుస్తారన్నట్లు దేశ శక్తే కార్యాన్ని సాధిస్తుంది. అద్దాన ఆశయసిద్ధి కలుగుతుంది.

## [2] వృషభనందివీంద వచ్చుట

కాలజ్ఞాన వాకాలం :

మరుగు కొండలు
మూడు దాటి
సదోపవాసమున

చాల ప్రసుక్కి
జీర్ణ దేహాము మీాద
దివ్య దేహాము నెత్తి
సూర్య మండల
వృషభ నందిమీాద
శ్రీరాములు
వస్తూవున్నాడనెను.

తాత్పర్యము :

మరుగుకొండలు అనగా స్వార్థం. కామము, దుర్వ్యసనములు వీటినిత్యజించి చాలప్రసుక్కి దివ్యదేహాము (కనపడే శరీరంకాదు) నిర్మలమైన ఆత్మ అదే దివ్యదేహాము, ధరించి సూర్యమండల వృషభనందిమీాద రామధర్మజమూర్తి వస్తున్నాడని వ్రాశాడు. రాముడు సూర్యవంశ ప్రదీపకుడనియు వృషభ నంది వైశాఖం వృషభమాసము కనుక ఆమాసాన్నుంచి నిశ్చయమనస్సుతో వచ్చుట అనిఅర్థము.

వైశాఖమాసంనుంచే రామధర్మజమూర్తి రామధర్మజ స్థాపనకొరకు ప్రచారం ప్రారంభించినాడు. ఈవీరవసంతుడు జనులకు విజయం చేకూర్చుటకు బయలుదేర వలసి వచ్చినది.

## (3) ముదమందుచుండుట

కాలజ్ఞానమూలం

రమణీమణిని గూడి
రామధర్మజులు
కదలివచ్చెడు జాడ
కలికి రూపమున
ముదమందు చుండునా
మూడులోకములు

తాత్పర్యము :

ఎవరే కార్యములను తల పెట్టినా దానిఫలితాంశం సంతోషదాయకంగా దేశంలో సర్వసౌఖ్య, సౌభాగ్యకరంగా ఉండుట యేకదా ? అందరకు కావలసినది సుపరిపాలన మనే రమణీమణిని గూడి రామధర్మజులు వచ్చి ప్రజలంతా సంతో షించేటట్లు పాలిస్తాడనీ అనుచున్నాడు బ్రహ్మముగారు.

# 9. విజయములు

## (1) జనులువిస్తరిల్లుట :

కాలజ్ఞాన మూలం :

సారాముదప్పి

విస్తారములయ్యాని
వారావారముల్
వింతబుట్టేనిమా
వీరవసంతూని
విజయాములయ్యాని
విరివీగ జనుల్
విస్తరిల్లీనిమా

తాత్పర్యము :

మహిమాన్వితములైన కార్తీక, మార్గశిరమాసములలో శ్రీ వీరవసంతుని విశేషసంచారములో వారవారము విజయము ప్రబలుతూ జనులు విశేషముగా పాల్గొని విస్తరిల్లుట జరిగినది బ్రహ్మముగారి వాక్కేగదా! జనులు తండోప తండాలుగా కూడినారంటే శ్రీబ్రహ్మంగారి ఆశీర్వాదమేగాక యేమవ్వు తుంది. అంతటా పుష్పవర్షమే కురిసినది.

## (2) మార్గశిరపూర్ణిమ

## కాలజ్ఞానమాలం

అంబుజనయను మహిమను,
ఆమార్గశిరపున్నమును

బీజాక్షర మంత్రంబుల
సర్వదేవత్వము
సర్వాసర్వముయిచ్చె. ఉద్దండవీర
విజయంబులు మెరసె.

తాత్పర్యము :

అంబుజనయను మహిమనుఆమార్గశిరపున్నమును ప్రస్తావించి (30-12-1982) మార్గశిరమాసం (16-12-1982 నుండి 13-1-1983) బీజాక్షర మంత్రంబుల సర్వదేవత్వము సర్వమూయిచ్చి వీరవిజయంబులు మెరయునట్లు బ్రహ్మముగారు తెలిపియున్నారు.

ఆరామధర్మజమూర్తి విజయములు మార్గశిర శుద్ధ పూర్ణమికే (30-12-1982) లోకానికి తెలిసినట్లు జరిగినది. మార్గశిర బహుళదశమికి (8-1-1983) పూర్తివిజయము పొంది బహుళఏకాదశి (9-1-1983) ఆదివారమునకు పట్టాభిషేకమునకు నిర్ణయము జరిగినది. గీతావాక్యంలో "మాసానాం మార్గశీర్షోహం" అనుప్రమాణం కూడవున్నది.

## [3] విజయవికృతము

కాలజ్ఞానమూలం

విజయ వికృతంబు

నిమిష నిమిషమునీద
మహాదేవరాజ్య
వైరులనెల్లా
నిముష నిముషమున
ధూళి ధూళిగా మొత్తెను.
యాభై ఆరు
రాజ్యంబులన్నియు
గట్టినిమిషమున
దుష్టుల మొత్తివేసీని

తాత్పర్యము :

విజయకృతంబు నిముషనిషములమీద మహారామ ధర్మజ రాజ్యముగా పరిణమించినది. అందుచేత వైరవర్గము వారందర్నూ నిమిషనిమిషాల్లో ధూళిధూళిగా పోగలుగునట్లు మొత్తగలడని బ్రహ్మముగారు తెలిపినది బ్రహ్మవాక్కేగదా!

శ్లో॥ యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత।
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం॥

అన్నగీతా వాక్యానికి నిదర్శనం.

# 10. యుగసంధి

## కాలజ్ఞానమూలం

తమభేదవాదులు
నిందకునాశనమున
మార్గశిర శుద్ధలాలు
దివసమున
యుగసంధి అద్భుతము.
విదియ చంద్రుని కాంతి
కానకబోదురు
సూర్యకాంతి దీప్తి
అణగిపోవును.

తాత్పర్యము :

మార్గశిర శుద్ధల రోజున (23-12-1982) యుగసంధి జరుగునని బ్రహ్మముగారు తెలిపియున్నారు. రామధర్మజ మూర్తి స్వరూపములోయున్న యథార్థ కాంతిని తెలిసికోలేక పోయినారన్నమాట. ఈ యుగసంధిలో సూర్యకాంతిదీప్తి అణగిపోవుననికూడ తెలిపినారు.

# 11. మార్గశిర ప్రసన్నత

## [1] మందిరముచేరుట

### కాలజ్ఞాన మూలం :

పరమ యోగీశ్వరుల
కాలానకు
నదులుమూడు
పంచక మొకటి
పై మాసాలు
పందిటిమీదట
మమ కుమార
మహాత్ప్రకాశమయ్యాని.
మలినంబులుమాసీని.
మార్గశిర మాసానకు
మందిరము జేరీని.

### తాత్పర్యము :

మార్గశిర మాసంలో రాజ్యం పీఠస్థమౌతుంది. రామ రాజ్యం పీఠాధిష్ఠితమైతే దేశంలోని అన్ని మలినాలు ప్రక్షాళిత మౌవుతవి. అయితేదీనికి కొంత కాలవ్యవధికూడ అవసరం. కనీసం ఐదుమాసాలు, ఆపైన మరొకఐదు మాసాలు మొత్తం పదిమాసాల తర్వాతగాని కాలు నిలవ త్రొక్కుకొనుటకు, మహాకీర్తిని ఆర్జించుటకు సమయముకాదు.

అంతదనుక అన్నింటను కృషిజరుపుచునే ఉండవలెనని తాత్పర్యం.

## 2] వీరదేవత్వము

### కాలజ్ఞానమూలం

వీర దేవత్వంబు
విక్రమంబున
ఆ దేవ మార్గశిరం
యిప్పుడు ప్రసన్నమాయెను.

తాత్పర్యము :

ఆమూర్తియొక్క వీర దేవత్వము మార్గశిరమాసములోనే ప్రసన్నమగునని కూడ బ్రహ్మముగారు పల్కియున్నారు. గీతావాక్యంకూడ అటులనే తెల్పుచున్నది.

రామరాజ్యమునకు జరుగవలసిన కార్యక్రమం (ఎన్నికలు) మార్చినెలలో జరుగవలసియుండగా అట్టి కార్యక్రమం మార్గశిరంలోనే (డిశంబరు, జనవరి) జరుగుట దైవికమేనని తెలుస్తూనేయున్నది.

## (3) అక్షోణీలు, మార్గశిరం, మాఘం

### కాలజ్ఞాన మూలం :

మార్గశిరమాసంబు

మీదమాఘపంచమి వరకు
బ్రహ్మతూప్తతం చేత
నిలిచినవారెల్లా
కాలమహిమచేత
24 అక్షోహిణీలు మడచును.

అక్షౌహిణి (శబ్దార్థం) :

లోకంలో ప్రతినిత్యం జననము మరణాలు అక్షౌహిణీ సంఖ్యలో జరుగుతుంటవి. భారతదేశం మొత్తంమీద ఎంతో మంది పుడతారు. మతిమంతులైన బుద్ధిమంతులు చాల తక్కువగా వుంటారు. అట్టివిజ్ఞానంకలవారిలో యేఒక్కడైనా ఈనాకాలజ్ఞానంచదివితే లోకంలోని అక్షౌహిణీ జనం చదివి నట్లే. ఎందుచేతనంటె మంచివాని విజ్ఞానం లోకాన్ని బాగు చేస్తుంది కనుక. అదేవిధముగా నాకాలజ్ఞానాన్ని అర్థంచేసు కోలేనివాళ్ళుకూడా చాలామంది అక్షౌహిణీ సంఖ్యలోనే ఉంటారు కూడా. ఇటువంటి వారు నాపుస్తకంమీద యుద్ధం చేసిన వాళ్లేఅవుతారుగాని అర్థాన్ని దోచుకుపోలేరు కనుక ఈరామధర్మజునికి విజయమే కలుగుతుంది అనిఅర్థము.

మరొకసంగతి. పైన వ్రాసిన అక్షౌహిణీపథంలో "హి" అనేఅక్షరాన్ని తీసేస్తే, అక్షోణీ అవుతుంది. కొన్నిపుస్తకాల్లో అక్షోణీ అంటే ఏమిటి? : అనేవున్నది. మరి అక్షోణీ

అంటేఏమిటి ? అంటారు. ఆపదం "అక్షోణీ" కాదు "ఆక్షోణీ" అని. ఆక్షోణీ అంటేఏమిటి? క్షోణీఅనగా భూమి. ఆక్షోణీఅంటె భూమండలం యావత్తుఅని. అంటె భరతఖండమంతా అనిఅర్థం. అనగా ఈరామరాజ్యం, ఇవాళ భూమండలంలో కొంతభాగము మాత్రమే ప్రవర్తించినా, చిన్నదీపం వెలిగిస్తే దానికాంతి కొన్ని వందల గజాలదూరం ప్రసరించినట్లు అంగుళం దీపపుకాంతి ఫర్లాంగుపైగా కనపడుతుందిగదా? అదేవిధంగా ఒకదేశం రామరాజ్యమైతే ఆకీర్తి అన్నిదేశాలకు రామరాజ్యాన్ని ప్రకాశరూపంలో ప్రజ్వలింపజేస్తుంది. అనిబ్రహ్మంగారు మనకు వీరభోగవసంతరాయలు కీర్తి దశదిక్కుల వ్యాపించి రామరాజ్యాన్ని ఆనందడోలికల్లో ముంచుతుంది అనిఅర్థం.

## 12. పంచమం

కాలజ్ఞానమహాలం

యాగంచేసే
దివసమునకు
సర్వానకు
పంచమే కారణం అని—
ఆనతిచ్చినారము.

రామధర్మజులకు
పంచమె కారణం
మీాకుమాకూ
ఆనందాశ్రమముల
పట్టుపువసమే
కారణము. ఆనందాశ్రమములు
పంచమ వేదమునకు
ఆదిదేవత
సర్వాస్పుండరీకాక్షుండైన
పురుషోత్తమునకు
పంచమేకారణము.

తాత్పర్యము :

ఈ రాజ్యాంగము అంతా ఒక ప్రజాయాగము వంటిది. "దీని ఆఖరు రోజు పంచమం" అనగా 5వ తేది అని. అందుకే యాగం చేసే దివసానకు పంచమే కారణం అని ఆనతిచ్చినారము. అనికూడ బ్రహ్మముగారన్నారు.

ఈ ప్రకారం రామధర్మజులకు మార్గశిర బహుళసప్తమి (జనవరి 5వ తేది) అఖండ విజయమునకు కారణమైనది. ఇది కూడా బ్రహ్మవాక్కే గదా !

# 13. రామధర్మజరాజ్యమునకు హేతువులు

## (1) శిరోమణి నిర్ణయము

**కాలజ్ఞాన మూలం :**

రామధర్మజుల
యేలుబడి మహిమ
సిద్ధాంత శిరోమణీ
నిర్ణయము.

తాత్పర్యము :

శ్రీ రామధర్మజమూర్తి పరిపాలన, దాని మహిమ సిద్ధాంత శిరోమణి నిర్ణయముగా బ్రహ్మముగారు తెలిపి యున్నారు.

## (2) రామధర్మజరాజ్యం

**కాలజ్ఞాన మూలం :**

వీరాధి వీరాత్మ చెంత
అమోఘ వాక్యమునను
ఆరునెలలు యిల్లించి
ఆ మీద

దేవ భోగంబుల మీద
శుభ్ర దివ్యాంబరంబులు
ఘనత మీద

తాత్పర్యము :

రామధర్మజుడు వీరాధివీరుడై వీరాత్మ అనగా మహా మేధావులు ఎంతోమంది వుండగా వారి వాక్యములు వింటూనే తన ప్రభావముతో రామధర్మరాజ్యాన్ని అధిష్ఠించి అనేక భోగములను సమకూరుస్తూ పూజ్యత్వాన్ని పొందుతూ వున్నారు. అయితే ఈ పూజ్యత్వము రాజ్యస్థాపన నుండి ఆరు మాసాల కాలమైనా నడిస్తేనే కాని ఘనత కెక్కదు.

## [3] రామరాజ్యం

### కాలజ్ఞాన మూలం :

బాదామి మేకమే రాజ్యం
రామధర్మజమే మయం
ఆరామ ధర్మజం వందే
ఆత్మరక్షణమే మయం

త్రైలోక్య మేకమే రాజ్యం
రామధర్మజమే మయం

రమ్యమేకో గమాదేవో
రామధర్మజమే మయం.

తాత్పర్యము :

ఇచట ఒక ప్రచ్ఛన్న వాక్యం. 'బాదామిా' అని. బాదా అంటె ఒకటి హైదరాబాద్ రెండు సికందరాబాద్. "అమిా" ఈ రెండు కలసి "ఏకమేరాజ్యం" అని జంటనగరాలనే పేరుతో ఏకరాజ్యాధిపత్యం మన దేశంలో కలుగుతుందని అర్థం. ఇందులో శ్రీశైల లింగం, ద్రాక్షారామ లింగం, వేములవాడ లింగం, ఈ మూడు లింగాలు కలిసి త్రిలింగం అయినది. ఈ త్రిలింగ దేశం అంతర్భాగంలోనిదే తెలుగు దేశం. ఈ దేశానికి "బాదామిా" యీ జంట నగరాలలో హైదరాబాదు ప్రధానమైన ముఖ్యపట్నమవుతుంది. ఇచట రామరాజ్యం వెలుస్తుంది. ధర్మం ప్రబలుతుంది. రక్షకులైన ప్రభువులకు ప్రజాదరణ కలుగుతుంది. ప్రజలకు ఆత్మరక్షణ కలుగు తుంది. రామరాజ్య పతాకం దేశీయ పతాకం ఎగురు తుంది. సమస్త సంతోషాలు ప్రబలుతవి అని అర్థం.

## 14. ఆదివారం పట్టాభిషేకం

### [1] సుకుమార దివ్యదేహం

కాలజ్ఞాన మూలం :

సుకుమార

దివ్యదేహంబు
మీద
శ్రీరామ మంత్రంబు
రామభద్రము
మీద
ఆదివారము
పట్టము గట్టేరు.

తాత్పర్యము :

శ్రీరామధర్మజమూర్తి సుకుమార దివ్యదేహి అనియు శ్రీరామ మంత్రము మీద ఆదివారము పట్టము గట్టెదరని బ్రహ్మముగారు తెలిపియున్నారు.

అట్టి శ్రీరామధర్మజమూర్తికి మార్గశిర బహుళ ఏకాదశి ఆదివారము (9-1-1983) పట్టము గట్టుట బ్రహ్మ వాక్యమే కదా.

## [2] నమ్మియుండుట

కాలజ్ఞాన మూలం :

ఆ పౌర్ణమి
మీద

అంగారక భోగంబులు మెరయు
వినయము మీద
వీరధర్మజు
కీర్తి ఘనత నెరసి
దొడ్డ దొడ్డ దొరలు
పెల్లు అణచిన మీద
గుత్తి సీమను
ఏకమునను
దుమ్ము దుమ్ముగ యెత్తి
ధర్మజు పుత్రుని
ఆది ఆదుల మీద
ఆదివారము నాడు
పట్టము గట్టేది.
రామధర్మజుల
మాట నమ్మి యుండేది.

తాత్పర్యము :

ఆ మార్గశిర పూర్ణిమ మీద (30-12-1982) వీర ధర్మజు కీర్తి ఘనత మెరసి ఆదివారము పట్టము గట్టేది. రామ ధర్మజుల మాట నమ్మి యుండేది యని గూడ బ్రహ్మంగారు తెలిపియున్నారు.

కనుక ఈ రామ రాజ్యానికి మార్గశిర మాసమే శుభ సూచకము. ప్రజామోదకరమై స్వల్పవృక్షం కల్పవృక్షమంతగా విభాసిస్తుందని భావం.

## 15. రామధర్మజ రాజ్యపాలన

### [1] కర్మనిష్ఠుల గౌరవించుట

కాలజ్ఞాన మూలం :

బావ్రాల లోపల
కూతాలు బుట్టేని
పట్నాలలో లక్ష్మి
పడ్చేనిమా
కావరించిన నరుల
ఖండించి వేసేరు
కర్మనిష్ఠుల
గారవించేరుమా !

తాత్పర్యము :

కర్మనిష్ఠుల గౌరవం అంటే యజ్ఞయాగాది క్రతువులు జేసే బ్రాహ్మణోత్తములు అనుకుంటారేమో. అది ఎంత మాత్రం కాదు.

రాజ్యపాలనలో దుర్వ్యసనాలు, దుష్టత్వాలు చేయకుండా సత్యంతో, ధర్మంతో, స్వార్థరాహిత్యంతో, కార్యదక్షతతో నిర్వహించే వర్గంవారు ధర్మరాజ్యములో గౌరవింపబడుతూనే వుంటారు అని తాత్పర్యార్థం.

## [2] సామ అధర్వాణము

### కాలజ్ఞాన మూలం :

భువిలో చతుర్దశ
భువనాములన్నియు
భోగేంద్రశయనూడు
యేలీనిమా
సావధానముగాను
సామ అధర్వాణములు
సాంగమై ముందర నడిచీనిమా !

తాత్పర్యము :

భోగశయనుడైన రామధర్మజమూర్తి పాలనలో సామ, అధర్వాణ సాంగమై ముందర నడిచీనిమా అని బ్రహ్మంగారి వాక్యములో వున్నది.

ఉదాహరణకు ఛాందోగ్యోపనిషత్తులో సామమును గూర్చి ఈ విధముగా వున్నది.

శ్రు॥ కాసామ్నో గతిరితి స్వర ఇతి హోవాచ ।
స్వరస్యకా గతిరితి ప్రాణ ఇతి హోవాచ ।
ప్రాణస్యకా గతిరిత్యన్నమితి హోవాచ ।
చాన్నస్య కాగతిరిత్యాప ఇతివ హోవాచ ।

తాత్పర్యము :

గీత॥ సామమున కెల్ల గతియేది స్వరము సుమ్మి ।
స్వరమునకు గతియెయ్యది ప్రాణము సుమి ।
ప్రాణమున కేది గతియగు నన్నము సుమి ।
అన్నమున కేదియో గతి యంబులు సుమి.

శ్రు॥ అపాంకా గతిరిత్యసౌలోక ఇతి హోవాచ
అముష్య లోకస్యకా గతిరితి న స్వర్గం లోక
మతి న యేదితి హోవాచ ।
స్వర్గం వయం లోకగ్ సామాభి సంస్థాపయా
మ స్వర్గసగ్ స్తావగ్ హిసామేతి ।

తాత్పర్యము :

గీత॥ అంబువుల కేది గతియయ్యె నమరలోక।
మమర లోకంబు కేది గతి యమరలోక ।
మును నతిక్రమించిన దేదియును గలుగదు ।
సామమును గూర్చి యీ రీతి స్వర్గలోక ।
మనుచు సంస్థాపన మొనర్ప మనకు దగును ।
కనుక సామ్యంబె స్వర్గంబుగా వచింత్రు ।

దీనిని బట్టి బ్రహ్మంగారు సామమును తెలుపుటలో ఈ పరిపాలన స్వర్గలోకముగా వుండునట్లు నడుచునని బోధపడు చున్నది. స్వర్గలోకమునే సామమున కాధారముగా నిర్ధారింప బడుచున్నది. స్వర్గమే సామముగా వేదము స్తుతించు చున్నది.

"శిష్యుడు గురువును ప్రశ్నించు చున్నాడు." సామ మన నేమి? సామమునకు మూర్గమేది? అని —

గురువు : స్వరమే సామ మనబడును.
శిష్యుడు : స్వరమునకు మూలమేది ?
గురువు : ప్రాణము.
శిష్యుడు : ప్రాణ మెటుల నిలచును ?
గురువు : అన్నము వలన.

శిష్యుడు : అన్నమునకు మూల మేది ?

గురువు : ఓషధులు (ఓషధీభ్యోన్నమః)

శిష్యుడు : ఓషదు లెట్లు పెరుగును, ఫలించును ?

గురువు : వర్షోదకములచే ఫలించును.

శిష్యుడు : ఉదకములకు స్థాన మెద్ది ?

గురువు : భూ లోకమే. అనగా భూ లోకంలో యజ్ఞ యాగాది క్రతువులు చేస్తే, స్వర్గలోకంలో వున్న ఇంద్రుడు వర్షాలు కురిపిస్తాడు. అద్దాన ప్రజలకు పుష్టిగల ఆహారం లభిస్తుంది అని.

అందు వలన ఈ భూ లోకమునకు దేవలోకమునకు అన్యోన్య సంబంధం ఆచంద్రార్కం ఉండనే ఉంటుంది. పైరులు చక్కగా పండి పంటలు ఫలిస్తే యీ భూ లోకమే స్వర్గలోక మవుతుంది. ఈ రీతి సాంప్రదాయం మూలకముగా ప్రజలు దేవతలను పూజించి దేవతల ప్రసన్నతచేత ఒడుదుడుకులు లేని కాలమును గడుపుకొంటూ ప్రజలందరు ఆహార విహారాదులతో ఉత్సాహవంతులై సామాజిక సౌఖ్యములను మనోజ్ఞముగ సంగీత సాహిత్య, నృత్య, నాట్య, తరంగసినిమాలతో అమందానందమును పొందుచుందురు గాక యని ఈ సామ మంత్రార్థము.

# 3 దుష్టుల ధ్వంసము

## కాలజ్ఞానమూలం

ఆత్మ సుజ్ఞాన శ్రీరంగా
రామధర్మజులు వచ్చి
దృష్టాంతము జూపి
పూర్వార్జితమునే
పుణ్యము వల్లను
దుష్టుల నెల్లా
ధ్వంసం చేస్తూ వున్నాము.

తాత్పర్యము :

కాలజ్ఞాన రచయిత బ్రహ్మంగారు తన ఆత్మజ్ఞానం అంటె దివ్యజ్ఞాన దర్శనము చేత "రామధర్మజుడు" మున్ముందు రామరాజ్యం సాగించేందుకు రాగలడు. అనే విషయాన్ని గుర్తెరిగియే యున్నాము. కనుక గ్రంథములో లిఖించాము. ఆ రామధర్మజుడు తన పూర్వార్జిత సుకృత పుణ్య విశేషము చేత బహు ప్రజ్ఞావంతుడై దుష్టశక్తులను "తన రామ రాజ్యంలో తలయెత్తకుండా ధ్వంసం చేస్తాడు. దానిని కూడ ఇపుడే ప్రత్యక్షంగా చూచినట్లె చెప్పుచుంటిమి. అంటాడు.

## (4) రామం రామం అనే రాజ్యం

కాలజ్ఞానమూలం

వీరధర్మజురాఘవుల
ఉద్భవము
సూర్యనందినే
ఉద్భవము అయ్యేను
అని లోకమంతా
అనుకొనేరు
రామం, రామం అనేరాజ్యమెల్లా
వారే యేలేరు

తాత్పర్యము :

ఆసేతు హిమాచలపర్యంతం శ్రీరామచంద్ర మహా ప్రభువును రామా! రామా! అని తలచనివాడు లేనేలేడు అనుటలో సందేహములేదు. భారతీయులైన వారందరు రామ నామస్మరణ చేయువారలే. అయితే కొందరు రాముణ్ణి ద్వేషించే వారుకూడా ఉన్నారు కదా! అంటారేమో? నిజమే. ద్వేషభావనతో కూడ రామనామంచేసేవారు చాలమంది ఉండిఉన్నారు. ఇతర మతస్థులలో రామనామం చేయుటకు తగిన ప్రత్యేకత ఒకటి కలిగింది. శ్రీరామచంద్రుడు తానీ షాకు ప్రత్యక్షముకావడమే. ఆ కారణముతో వారికి కూడా

తోడునీడైనాడు రాముడు. ఆ రామనామం నేడుకూడా "రామరాజ్యం" కావాలి అని అందరి హృదబ్జాలలో పరిమళపూరిత వాంఛార్కమౌతున్నది. ఇదినిజం.

## 16. మహిమలు

### (1) సర్వసముడు

కాలజ్ఞాన మూలం :

రామభోగము మీద
ఉదగరుల సొమ్ము
తగను యిచ్చెగనుక
తెలిసేది
సార్వభౌముల
సార్వకాలమున్నా
సర్వమున్నా
యేలాగైనా
సర్వసముడుగా తెలిసేది.

తాత్పర్యము :

రాముడు సర్వసముడు. అన్నిభోగములను విడనాడి, దేశప్రజల క్షేమమునకై అడవులబడి సర్వరాక్షస సంహారము

చేసి తనధర్మాన్ని ప్రజలకు సప్రమాణికంగా కార్యరూపంలో నడచి ఆదర్శపురుషుడై, తన సార్వభౌమలక్షణాన్ని నిర్వహించుకుంటూ, సర్వకాలము, ప్రజాక్షేమమే తన క్షేమంగా ఎంచుకొని సర్వమతసమత్వ పరిపాలన సాగించాడు. ఇంతకంటె మహనీయుడు ఎవరున్నారు. అందుచేతనే అందరకు "రామరాజ్యం" కావలసివచ్చినది.

## (2) ఏకాక్షరముమీద నడిపించుట

### కాలజ్ఞానమూలం

మాధర్మకాలమెల్లా
ఏకాక్షరము మీద
నడిపించుమని తెలిపి
అందుండి
రామధర్మజమహిమ
పశ్చాద్భూమి మధోపురః

తాత్పర్యము :

రామప్రభువు ధర్మాన్ని నాలుగు కాళ్ళమీద నడిపిన వ్యక్తి. అందరకు సేవనీయుడు. అందుచే ఆయనకీర్తి ఈ భూలోకమునేగాక ముల్లోకములలో వ్యాపించి ఏకాక్షరమైన ప్రణవస్వరూపంలా ప్రకాశించింది.

## 3 వైశాఖ విదియలు

### కాలజ్ఞానమూలం

రామభోగంబుమీద
ఆదినారాయణ మహిమ
ఆ రీతితో ఈమహిమ
శ్రీరామాత్మజ మహిమ
వైశాఖమాసంబు విదియ
భూవలయంబుమీద.

తాత్పర్యము :

ఆ రీతితో ఈమహిమ శ్రీరామాత్మజ మహిమ వైశాఖ మాసములో విదియతో ప్రారంభమగునని తెలిపినారు. వైశాఖ మాసాన్నుంచి లెక్కిస్తే ఈమార్గశిరమాసం అధిక ఆశ్వయుజ ముతో కూడా 9వ మాసమే అయినది. ఎంత ఆశ్చర్యమో. ఈరామధర్మజులు తన కార్యకలాపాన్ని ఒక దివ్యక్షేత్రమైన తిరుపతిలో ప్రారంభించి దేశమెల్లా పర్యటించి ప్రజానుగుణ్యమైన రాజ్యపాలన నడుపగలనని తెలుపుచూ తన సంచార కార్యక్రమం ఆ దివ్యక్షేత్రమైన తిరుపతిలోనే ముగింపును కూడా చేసినాడు. యిది నిజంగా దైవసంకల్పమే కాకుంటే ఇలా జరుగదు.

## 4 వీరధర్మజుని సేవ

### కాలజ్ఞానమాలం

సాక్షాత్
రామధర్మజమూర్తి
మహిమచే
ఆర్తిని సంతోషంబు
ఆ దినంబులమీద
పద్మకంఠంబు నందు
బుట్టిన పుత్రుని
విదియ చంద్రుని బోలు
మద్భక్తి మహిమచే
వీరధర్మజుని సేవ
జేసినవారిని
అంభోరుహమ్ములు
ఆర్తి మెరయ
పంచాత్మురంగేశు
రాజ్యమంతయు యిచ్చె.

తాత్పర్యము :

వీరధర్మజ స్వరూపుండైన రాముడు దుష్ట సంహారము

చేసి లంకారాజ్యానికి విభీషణుణ్ణి పట్టాభిషేకంచేశాడు. చూశారా? శత్రువులలోని వాడైనా దయారసంతో ఆదరించి ప్రేమించి, రక్షించి, చివరకు రాజ్యాధి పత్యంకూడా ఇచ్చి నాడు. గనుక రామునిసేవ చేసేవారికి లభించని వస్తువంటూ యేమీఉండదు. అని తాత్పర్యం.

## 5 ఆచంద్రతారార్కం కీర్తి

### కాలజ్ఞాన మూలం :

రామధర్మజుల కీర్తి
నేడు మొదలుకొని
ఆచంద్రతారార్కం
సర్వకాలం
నడిచీని.
రామధర్మజుల
దరిశనం చేయవలెను
ధర్మమెల్లా
రేపే కనిపించవలెను

తాత్పర్యము :

కనుకనే రామచంద్రుడనబడే రామధర్మజుని కీర్తి ఆనాటి నుంచి నేటివరకు కీర్తి సాగరముకాగా ఆయనమూర్తిని

దర్శించిన వారలకు మంగళములు కలిగి ధర్మం ఆచంద్రార్కం నిలుస్తుంది.

## 6 ప్రకాశము

### కాలజ్ఞాన మూలం :

ఉదయము
కాకమును పే
ప్రకాశమయ్యేను.
ధర్మరాజు వచ్చెనని
అందరూ
ప్రకాశమయ్యేరు.
కడమరాజ్యములెల్లా
రేపే యేలేరు. కన్నడ నెల్లా
రేపే రక్షించేము
రాజ్యము లెల్లా
రేపేయేలేరు.

తాత్పర్యము :

మాకు ప్రియశిష్యకోటిలో వుండే యేలాటి మహా ప్రభువులకైనా మాఆశ్రమములో ఆశ్రయం ఉంటుంది. ఇతర రాజ్యాలేవీ "మారామరాజ్యంతో" సాటిరావు. అనిలోకంలో

అందరూ "రామరాజ్యాన్ని" ప్రశంసించేరు. దానికోరకు మేము నేడే, రేపే రాజ్యకారకులకు రక్షణ ఇప్పిస్తున్నామంటు న్నారు బ్రహ్మంగారు. ఇదియే ప్రకాశక వాక్యం. ప్రకాశం కూడాను.

## 7. మగువభారము అణగుట

కాలజ్ఞానమూలం

మార్గశిర శుద్ధ
నవమి మొదలుకొని
బహువింతాలు
ప్రబలీనిమా।
మార్గశిర శుద్ధ
పౌర్ణమి లోపుల
మగువ భారము
లణగి పోయేనిమా!

తాత్పర్యము :

ఇదీ ఇచ్చుటి విశేషం. మార్గశిర శుద్ధ నవమినుండీ ప్రబలిన రామరాజ్య మహాశక్తి బహుముఖములుగా వృద్ధి చెంది-విస్తృతమై తనకు పూర్ణిమనాటికి కల్పవృక్షమై లోడగ

నిష్ప్రన్నమై యుండిన రాజ్యములోని మగువ భారమును (అనగా పౌరుష శక్తిలేక నశించి యుండుటను) అణగద్రొక్కి తాను పౌరుషముగ పైకి రాగలిగి సత్కీర్తిని ప్రపంచమంతటా ప్రతిధ్వనింపజేసినదని భావము. మరియు—

మార్గశిర శుద్ధ నవమినుండి (24-12-1982) ప్రబలిన రామధర్మజమూర్తి మహాశక్తిబ హుముఖములుగా వృద్ధిచెంది విస్తృతమై మార్గశిర పూర్ణిమకు (30-12-82) అఖండ కల్ప వృక్షమైనది. అపుడు అనేక వింతలు కలుగుననియు, మార్గశిర పూర్ణిమి లోపల మగువ భారము లణగిపోవుననియు బ్రహ్మము గారు తన వాక్యములలో పేర్కొనినారు.

పై తెలిపిన కాలములో రామధర్మజమూర్తి యొక్క మహిమ బహుళవ్యాప్తి చెందినది. దేశములో లోగడ అఖండ విజయ శక్తిగా పేరు పొందిన మగువ (అమ్మ) ప్రభావము తగ్గిపోయినది. ఇది బ్రహ్మవాక్యమే గదా!

## 17. వీరధర్మజుల కాలమయం

### కాలజ్ఞాన మూలం :

అమావాస్య చంద్ర మేకంతు
ఆది వీరకాలమే మయం
అడ్డపున్నమ విశ్రాంతు

ఆదిత్యమండలం మయం
విష్ణువీర దరిశనం చైవ
వీరధర్మజ కాలమయం.

తాత్పర్యము :

దీనికి సూర్యచంద్రగ్రహణాలు వ్రాసిన అవసరంలో యీవాక్యమునకు వలసిన అర్థమును వివరించి యుంటిమి. అయిననూ మరల మరల బ్రహ్మముగారు వీరధర్మజుని కాలాన్ని సుస్పష్టంగా ఎందుకు ఉద్ఘాటిస్తున్నారనగా యీ రామరాజ్యంలో అందరకు నిదానము మీద మంచియే జరుగుతుంది. దేశసౌఖ్యం యేర్పడుతుంది అని తెలిసేనిమిత్తం దివ్యజ్యోతి దర్శనరూపమైన తేజస్సు వెదజల్లటం కల్గుతుంది అని తెలియచేస్తున్నాడు.

## 18. భక్తి

### కాలజ్ఞాన మూలం :

దేవబ్రాహ్మణ
విశ్వాసముకలిగి
రామధర్మజులమీాద
భక్తికలిగి నడిస్తే
రాయనా

ఆచంద్రస్థాయిగాను
సుఖముగా వుందురు
పదోఅవతారంబు
రామావతారంబు

తాత్పర్యము :

బ్రహ్మంగారు తన భక్తజనులకు బోధిస్తున్నారు. సాంప్రదాయ భక్తులారా! మీరెల్లరు దేవబ్రాహ్మణ భక్తి విశ్వాసములుకలిగి వుండండి. రామరాజ్య శ్రేయస్సు కోరండి. దేశాభిమానం చూపండి. ఇవ్విధమున ఉంటే మీకు సకలై శ్వర్యసంపన్నత్వం కలుగుతుంది. సుఖస్థితి హేతువు నా పది యవదగు "రామావతారము" ఇదియే రామరాజ్య స్థాపనం చేయునది. తెలుసుకోనండి

# 19. ఉపేక్ష

కాలజ్ఞాన మూలం :

రాజే
శ్రీరామధర్మజుల
ఉపేక్ష చేసిన
వారిని రంపాన

మూడేసి
వ్రయ్యలుగా కోసేది.
జయం జయం
ఎదురుగా
వచ్చినవారిని
రామధర్మజులు
ఆనపెట్టి
నమ్మికయుంచి
రక్షించేది.

తాత్పర్యము :

పై విషయం తెలిసినడిస్తే అంతా జయం లేకుంటే సర్వం ఉపేక్ష, ఇదియే మీకు నాఆనతి. దీనిని నమ్మితే సర్వజగద్రక్ష శ్రీరామరక్ష."



# శ్రీ బ్రహ్మంగారి

# "కాలజ్ఞానములోని అద్భుతమహిమలు"

# [రామరాజ్యము]

## రెండవ భాగము

శ్రీరంగనాథస్వామి - కావేరీ - శ్రీరంగం

శ్రీ రామ ధర్మజమూర్తి



# కాలజ్ఞాన వచనములు

## 1. రామధర్మజుని పుట్టుక యెరుగలేరు

మనస్సులో శంకలరంగా వర్ణ బ్రహ్మము మీద జగదేక నాథా సర్వేశాచ కధరాత్మా సర్వేశా, రాజేంద్రు రంగని మహిమ. లక్ష్మీకళత్ర కారుణ్యము మీద దిన దినము కనుపిస్తిమి. మహిమాత్మము. శ్రీరంగ జయ కుమారా ! శ్రీ వీరాత్మా, జయజయ ధర్మజపుత్ర జయ జయ కస్తూరి రంగా మానవనాథా ! వెంకటేశా, జయ జయ ఆచంద్ర సూర్యకాంతులుగా రంగరాజనే వార్త పట్టాభిషేకంబు పదమ పున్నము మీద రంగని మహిమ తెలియంగలేరు. ధర్మజుని పుట్టుబడి యెరుగలేరు. తెలియరాదు. కారణమెవ్వరు కానంగ లేరు. తూర్పున గురుమకరమందు శీఘ్రు శీఘ్రు సంభ్రమోస్తు ఐశ్వర్యమస్తు, ఆరోగ్యమస్తు బ్రహ్మాండమేకో అనంత

మస్తు కానేటి రంగప్ప కట్టడి చేసును. ఆ మీాదట వార్తలు దిక్కు దిక్కున వచ్చును. కుమార వీర ధర్మరాజు హస్తమహిమ జీర్ణదేహంబు హేమ వర్ణంబు దివ్య దేహము నిచ్చె - సర్వసంభమిచ్చె వాకు డాకులతో వన్నె యిచ్చె చామరాందోళికా చక్రాంకితము మీాద యేలెదము.

## 2. సన్యాసి వేషము

సన్యాసి వేషంబు సంతోషముల మీాద సాతూత్తు రామధర్మరాజమూర్తి ఉద్భవము. సర్వాత్మ సర్వే సర్వ నాటకధారి సదోపవాసంబు విడిపించి భోంచేయ కట్టడి చేస్తిమి. తెల్లకోకలు, తిరుమణి తిరుచూర్ణముతో చాల కట్టడి చేస్తిమి. అప్పుడు నా మహిమ కనుపిస్తూ వున్నారము.

## 3. రంగని మహిమ

శ్రీరామా ! నిన్ను నేను రంగని వద్దకు రావుగా రమ్మంటిని. అయ్యయో రావద్దంటినా నీకు అది

భాగ్యము కాదని అంటిని. రంగేశు రంగని మహిమ రాజ్యములవారు నన్నే కొలిచేరు. అన్ని నా మాలు నా కుమారునికే యిస్తిమి.

## 4. శ్రీ రాముల రాక

పంచక మొకటింటి మీద ముసుగుకొండలు మూడు దాటి సూర్యమండల వృషభ నందిమీద శ్రీరాములు వస్తూవున్నాడనెను. కావేటి రంగప్పచే దరిద్రనాశనం చేసెను. ఈ ప్రొద్దు ఆ విష్ణు దేవుని మహిమ కుటుంబము కావేటి రంగప్ప కైలాసం నుంచి వస్తిమి. 24 యేండ్లు వుంటిమి. 25 యేట మా వద్దకి వచ్చును. సన్యాసి వేషంబు సంతోషముల మీద సంతోషము యిస్తిమి. ఆ పురుషోత్తముని మహిమలు అంతంతయు ఆదిశేషుని భోగభాగ్యము మీద, సాక్షాత్తు రామ ధర్మజమూర్తి వుద్భవము. సర్వాత్మ సర్వేశు, సర్వ నాటకధారి, కల్ల కలియుగము సాలు దిగిపోయెను.

## 5. మహిమలు

సిద్ధాంత శీలము సిద్ధము మీద ప్రజోత్పత్తి శీలం

బ్రహ్మమునను. కేశవాత్మకపుత్ర ఆదినాథ వీర దేవత్వంబు విక్రమంబున ఆదేవ మార్గశిరం యిపుడు ప్రసన్న మాయెను. చైత్ర బహుళ 3 లు యందు శ్రావణమాసం అని ఆనతి యిచ్చి వుంటిమి. రామ ధర్మజుల ప్రకారం బనగానిపల్లె సోమసంభ్రమములు, ఘనత మెరయ శ్రీ కావేటి రంగని ఘనత మెరయ అజ్ఞాత అపరాధ దండనల మీద క్షీరపానముల మీద నడిచే ఆది పుత్రుని కొడుకును, ఆ వరంబిచ్చియు, సర్వదా యీ గ్రంథము మహిమలోను, సుకుమార వీరధర్మజు మహిమ ఉద్దండ వీరుని సుతు మహిమలు, సంతోషంబు సాక్షిసాక్షుల మీద, రామమూర్తి మహిమ జో జో విష్ణుకుమారా, కేశవాత్మా, జో జో విష్ణు నిరంజన రంగా, రంగమున రామభోగము మీద వుద గరుల సొమ్ము తగను యిచ్చె గనుక తెలిసేది. సార్వ భౌముల సార్వకాలమున్ను సర్వమున్ను యెలాగైనా సర్వసముడుగా తెలిసేది.

## 6. దుష్టశిక్షణ

ఆత్మసుజ్ఞాన శ్రీరంగా రామ ధర్మజులు వచ్చి

దృష్టాంతము చూపి పూర్వార్జితమనే పుణ్యము వల్లను దుష్టుల నెల్లా ధ్వంసము చేస్తూ వున్నాము.

## 7. రామధర్మజము

కావేరీ గిరిజా తోయం వైకుంఠం రంగమందిరం
బాదామీ మేకమే రాజ్యం, రామధర్మజమే మయం।
శ్రీరంగే గౌతమంచైవ వారణాస్వంతు మేమయం।
ఆరామధర్మజం వందే ఆత్మరక్షణమే మయం.
ఆత్మాత్మా కాంతిమే కాంతు ఆనందగురు మన్యధా,
త్రైలోక్యమేకమే రాజ్యం రామధర్మజమే మయం।
రమ్యమేకో రమా దేవో రామధర్మజమే మయం।

## 8. కనకాభిషేకము

రామధర్మజస్వామి రాజీవముఖి గూడి
రాజ్యమెల్లా యేలవచ్చెనిమా।
జామజ జనకు డప్పుడు కావేటి రంగనికి
కనకాభిషేకము జేసీనిమా

## 9. వీర ధర్మజుడు

సందు సందుల మీాద ఆ ధర్మదేవత శ్రీరంగా జంఘ జానువులందు రంగా వీరధర్మంబు యిచ్చిన వీర కృపాంత శ్రీరంగా, అజాతమూర్తి శ్రీరంగా, ఆది వీరుని పేరు, నీపేరు కీర్తియు, వీరధర్మజు విలువ శ్రీరంగా, రాష్ట్రములలో నెల్లా నాపేరు నా పుత్రుని కొసంగిన శ్రీరంగా, ఆదినామము. నా పేరు విష్ణు కల్పము. శ్రీ రం గా అస్యశ్రీ వీరధర్మజ జపే వినియోగః।

## 10. రంగని మహిమ తెలియంగలేరు

సర్వేశా రాజేంద్రు రంగణీ మహిమం, లక్ష్మీక్షేత్ర కాంక్షణము మీాద దిన దినము కనుపిస్తిమి.... సత్యాం, సత్యాం అనే సంతోషము. దిన దినము కనుపిస్తిమి. మహిమ మహాత్మము శ్రీ రం గా జే జే కొమార శ్రీవీరాత్మ జే జే ధర్మజయపుత్ర జయ, జయ, కస్తూరి శ్రీరంగా యీా రంగని మ హి మ తెలియంగలేరు. ధర్మజుని పుట్టుబడి తెలియలేరు.

## 11. పట్టాభిషేకము

ఆ చంద్రసూర్యకాంతులు వెలుగంగ రాజసేవార్త పట్టాభిషేకంబు పరమ పున్నము మీద అబ్ద అబ్దము మీద ఆర్తిమెరయు. యే వేదమైనా యెత్తిచదువ కావేటి కస్తూరి రంగా నా కొడుకు వీరధర్మజు ధర్మమే వివరము.

## 12. మార్గశిర పూర్ణిమ

ఈశాన్యము నుండి పడమట సూర్యమందు వుద్భవ మవుతూ వున్నాము. అశంబరి శక్తి ఆయుస్సున్ను, ముందు కార్యవివరము, జితామిత్రుని వివరము ఆసమ సాహస వివరము, అచ్యుత అనంత రంగా, దుర్గాధ్యక్ష శ్రీరంగా, దూర వార్తల శ్రీరంగా, సుజ్ఞాన సుబుద్ధి శ్రీరంగా జాతస్వ రత్నము శ్రీగంగా దేవీద్రీరంగా. నా దేశ, ఆదవేణిలో మహోత్సవము, అంబుజ నయను మహిమను, ఆ మార్గశిర పున్నమును, బీ జా క్ష ర మంత్రంబుల సర్వ దేవత్వము సర్వ సర్వము యిచ్చె. ఉద్దండ వీర విజయంబులు మెరసె. సన్యాసి వేషంబు,

సంతోషములు మాన్ప ఆ మహాదివ్య దేహంబు యిచ్చెం.

## 13. భోగము

వీరధర్మజుపేరు యిచ్చి కించిత్తు తప్పులేనట్టి అంబీజములను ఆంగసంగములను అద్భుత భోగంబులను యిచ్చి యేలిన దేవ దేవోత్తమ రంగా .... ....
రామధర్మజుల యేలుబడి మహిమ సిద్ధాంత శిరోమణి నిర్ణయము.

## 14. రామాత్మజ మహిమ

వేగ వేగము మీద పుద్భవము మొదలు ఆర్తి ఆర్తి మీద రంగ సమూహంబు రామభోగంబు మీద యీ దినమారభ్యం ఆర్తి మీద రాజోత్తమాంగంబు రామభోగంబుమీద ఆదినారాయణ మహిమ, ఆర్తితో యీ మహిమ శ్రీరామాత్మజ మహిమ వైశాఖ మాసంబు విదియ భూవలయంబు మీద. రాత్రి

ఉదయము అయిన మీదట భూర్భుదప్సరుల ఆడి పాడేరు.

తాత్పర్యములు :

పైన తెలిపిన శ్రీరంగనాథ స్వామి, రామధర్మజ మూర్తులకు సంబంధించి తాత్పర్యములు ఎక్కువగునని తలచి తెలుపలేదు. పాఠకులకు ఈ కాలజ్ఞాన మూలవచనములలోని అర్థములు తెలియ గలవు.



శ్రీ బ్రహ్మంగారి

"కాలజ్ఞానములోని అద్భుతమహిమలు"

[రామరాజ్యము]

తృతీయ భాగము

శ్రీ యన్. టి. రామారావుగారికి

సమన్వయించిన విధము



మొదటి అధ్యాయములో కాలజ్ఞానములోని మూల వచనములకు తాత్పర్యము ద్వారా భావములు తెలుపబడినవి. రెండవ భాగములో శ్రీరంగనాథస్వామికి సంబంధించిన కాలజ్ఞాన వచనములు మాత్రము తెలుపబడినవి.

మొదటి అధ్యాయమందు తెలియ బరచిన 9 అంశములలో 55 హేతువులు చూపబడినవి. ఈ హేతువులలోని విషయములు శ్రీ యన్. టి. రామారావు గారికి ఏ విధముగా సమన్వయించినవో ఈ మూడవ అధ్యాయమందు అంశములవారిగా తెలుపబడు చున్నవి. అయిటములు మాత్రం చూపబడు చున్నవి. వాటిభావములు మొదటి అధ్యాయములో మాత్రం వున్నవి.

మొదటి అధ్యాయములోని అంశములు :

1 నుండి 4 వరకు – చంద్రగ్రహణ వివరములు, బ్రహ్మవాక్కు–
శ్రీ N. T. R. గారికి సమన్వయించిన విధము.

చంద్రగ్రహణం :

చాల కాలము క్రిందట వచ్చిన చంద్రగ్రహణం మరల

దుందిభినామ సంవత్సర మార్గశిర శుద్ధ పూర్ణిమనాడు (30-12-82) రావడం. అది శాస్త్రవేత్తల దృష్టిలో అద్భుతమైనది కావటం గొప్ప విశేషము కదా! ఈ గ్రహణాన్ని గూర్చి దాదాపు 400 వండ్లనాడే బ్రహ్మముగారు చెప్పడమనేది ఇంకా ఎంత ఆశ్చర్యమో ఆలోచించి చూడండి. ఆ గ్రహణాన్ని బట్టే ఈ నూతన ప్రభుత్వం రావడం, అధర్మాన్ని అణచటానికి ప్రయత్నించడం రామరాజ్య, ధర్మజరాజ్యములను ఆవిష్కరింప జేయడం జరుగుచున్నట్లు జనులు విస్పష్టముగా గ్రహించ వలసి వున్నది. బ్రహ్మముగారు చెప్పిన మార్గశిర చంద్రగ్రహణం సంభవించినపుడు ఆయన మాట ప్రకారమే మరువ భారము అణగినపుడు రామధర్మజరాజ్యము ఎందుకు విస్తరించదు. విస్తరించే తీరుతుంది. ఇందులో ఏలాంటి సందేహము అక్కరలేదు. మనము ఓపికతో వేచి చూడవలసివున్నది.

## 5. రామధర్మజమూర్తి ఉద్భవం

### [1] వీరోదయం - బ్రహ్మవాక్కు

### శ్రీ యన్. టి. రామారావుగారికి సమన్వయించిన విధం

ఇక్కడ ప్రస్తావించబడిన వీరోదయం రామశబ్దముతో వున్నది. గనుక ప్రస్తుత పాలకుడైన శ్రీ నందమూరి తారక

రామారావును అది సూచించు చున్నట్లు గ్రహించ వలెను. ఆయన చేసే పనులన్ని వీరోచితముగనే వున్నవి. ఏటికి ఎదురీదడముగా అనేక కార్యక్రమాలు ప్రారంభింప బడటం చూస్తూనే వున్నాము.

5. (2) పుష్పవర్షములు - బ్రహ్మవాక్కు
శ్రీ యన్. టి. ఆర్. గారికి సమన్వయించిన విధము

శ్రీ రామారావు తెలుగుదేశం పార్టి ఉద్దేశాలు ప్రచారము చేసేటపుడు దేశం మొత్తం ఆయన మీద పూలవానలు కురిపించినది. చుట్టు ప్రక్కల వున్న రాష్ట్రాలవారు కూడ ఈ ప్రచారానికి ఆకర్షింపబడిరి.

5. (3) మార్గశిరం మందిరం చేరుట - బ్రహ్మవాక్కు
శ్రీ యన్. టి. ఆర్. గారికి సమన్వయించిన విధము

శ్రీ రామారావుగారి పరిపాలన మార్గశిరమాసములోనే ప్రారంభమైనది. ఈ అంశమునే కాలజ్ఞానములో "మార్గశిరం మందిరం చేరుట" అని పేర్కొన బడినది. "మము కుమారర మహాత్మ్య ప్రకాశం" అనే మాట ఆయన బ్రహ్మాంశ సంభూతుడనే విషయాన్ని తెలియ జేస్తుంది. మంత్రివర్గ నిర్మాణం కూడ ఈ మాసములోనే జరిగింది.

5. (4) రామావతారము - బ్రహ్మవాక్కు
శ్రీ యన్. టి. ఆర్. గారికి సమన్వయించిన విధము

శ్రీరామారావు పరిపాలన ప్రారంభంకాగానే అవినీతిని అంతంచేయడానికి కంకణం కట్టుకొని లంచగొండి తనాన్ని రూపుమాపడం లంచగొండులను తొలగించడం మొదలైనవి ప్రారంభమైనవి కదా. ఈ విషయాన్నే "కల్ల కలి యుగము పాలు దిగిపోయెను" "దుష్ట ద్రోహులు నాశనమైపొయ్యేగ" అని సూచించబడ్డది.

5. (5) దేవతాసార్వభౌముండైన రామావతారం - బ్రహ్మవాక్కు
శ్రీ యన్. టి. ఆర్. గారికి సమన్వయించిన విధము

దేవతా సార్వభౌముండైన రామావతారం అనే మాటలను ఇంతవరకు వచ్చిన పాలకుల కంటె ఈతడు గొప్పవాడని. ఇతను చేసే కార్యాలు దేశ సంక్షేమాన్ని చేకూరుస్తాయని తెలియబడు చున్నది.

5. (6) రామధర్మజ ఉద్భవమానం బ్ర. వా.
శ్రీ యన్. టి. ఆర్. గారికి స. వి.

ఇందులోని అంశములు ఇంతవరకు మనము చెప్పుకున్న భవిష్యత్ విషయాలనే సూచిస్తున్నవని గమనించవలెను. శ్రీ రామారావుగారి సంచారములో కార్తీక మాసమందు

(16-11-82 నుండి 15-12-82) అంతట పూలవాన కురిసినది గదా.

5. (7) రామధర్మజస్వామి ఉద్భవము బ్ర. వా.
(8) రామధర్మజుల ఉద్భవము బ్ర. వా.
శ్రీ యన్. టి. ఆర్. గారికి స. వి.

ఇవి కూడా 6వ దానివలెనే జరుగబోవు విషయాలనే సూచిస్తున్నవి.

5. (9) శృంగారమూర్తి బ్ర. వా.
శ్రీ యన్. టి. ఆర్. గారికి స. వి.

శ్రీ రామారావుగారు ఇంతవరకు అనుభవించిన నటరాజ జీవితం శృంగారాది మహావైభవములతో కూడి కొనియాడదగినదిగా వున్నది. ఆ విషయమునే 'శృంగార మూర్తులై వచ్చేరుమా' అని సూచించినారు

5. (10) అమృతవచనం బ్ర. వా.
శ్రీ యన్. టి. ఆర్. గారికి స. వి.

రామధర్మజులు అనగా రామాయణములోని శ్రీరామచంద్రమూర్తి, భారతములోని ధర్మరాజు సూచింపబడుతున్నారు. ఇప్పటి రామారావుగారు కూడా వారివలెనే అమృతమయమైన పాలన కొనసాగిస్తారని గ్రహించాలి.

5) (11) కాలపరిపక్వము - బాలచంద్రునికాంతి బ్రి. వా.
శ్రీ ఎన్. టి. ఆర్. గారికి, స. వి.

ఎంతో కాలమునుండి వున్న పరిపాలన మారిపోయి (16-11-82 నుండి 15-12-82) కార్తీకమాసము మొదలు కొని తెలుగుదేశం ప్రచారమెక్కువై నూతన ప్రభుత్వ నిర్మాణానికి కాలం పరిపక్వము అయినదన్నమాట.

5 (12) సామగాన ప్రియుడు బ్రి. వా.
శ్రీ ఎన్. టి. ఆర్. గారికి స. వి.

ఇందులోని సామగాన ప్రియుడనే మాట సుదీర్ఘకాలము జరిగిన రామారావుగారి నటజీవిత విశేషాన్ని సూచిస్తున్నది.

6. రామధర్మజమూర్తి స్వరూపాలు

(1) రామభోగము బ్రి. వా.
శ్రీ ఎన్. టి. ఆర్. గారికి స. వి.

రామభోగమనగా శ్రీరామచంద్రుని భోగము వంటి సత్య ధర్మమయ భోగమన్నమాట.

6 (2) సర్వనాటకధారి బ్రి. వా.
శ్రీ ఎన్. టి. ఆర్. గారికి స. వి.

తన యువావస్థనుండి వందల కొలది నాటకాలలో (సినిమాలలో) వందల కొలది నాయక పాత్రలను ధరించి

ప్రజలను ఆకర్షించినట్లే ఈనాడు ముఖ్యమంత్రి పాత్రధారియై కూడా జనాకర్షణ చేయుచున్నాడన్నమాట.

6 (3) సన్యాసి వేషము - సంతోషము బ్ర. వా.
శ్రీ ఎన్ టి. అర్. గారికి స. వి.

రామారావుగారు తలపెట్టిన దోశోద్ధరణ కార్యానికి గృహస్థాశ్రమ బంధం పనికి రాదనుకొని సన్యాసిగానే కార్య సాధనకు పూనుకొనడం గమనించదగినది.

6 (4) విభూతి - తిలకం - బ్ర వా.
శ్రీ ఎన్ టి. ఆర్. గారికి స. వి.

వైదిక సిద్ధాంతములో విభూతికి ఎంతో ప్రాధాన్యము పరమార్థము వున్నవి. తక్కిన తిలకాలన్నీ రంగు వాసన కలిగి వుంటవి. విభూతి పరిశుద్ధమై తెల్లనికాంతి కలిగి వుంటుంది. అది సత్వగుణానికి సూచకము గూడా. దానికి ఇతర వస్తువుల వలె మండుటగాని, ఆరిపోవుటగాని నుండదు. అందుకే పరమ శివుడు దానిని ఒంటినిండా పులుముకొన్నాడు. ఎంతోమంది సాధువులకు కూడా అది ఇష్టమైనది. అలాంటి విభూతి - తిలకాన్ని రామారావుగారు ఏక రేఖగా ధరించడం బ్రహ్మం గారి కాలజ్ఞాన వాక్య రహస్యమే. అందరు విభూతిని తిర్యక్-పుండ్రముగాధరిస్తారు. ఈయన ఏకరేఖగనే ధరిస్తూవున్నారు.

ఇది "ఏకమేవా ద్వితీయం" అనే ఉపనిషత్ వాక్యానికి నిదర్శనంగా లేదా....?

6 (5) సన్యాసివేషం – బ్ర. వా.
శ్రీ రామారావుగారికి స. వి.

శ్రీ రామారావుగారికి తెలుగుదేశం పార్టీ పెట్టినప్పటి నుండి సర్వసంగ పరిత్యాగం చేసి, దేశాన్ని నడపాలనే ఉద్దేశ్యమున్నది. తన పార్టీ విజయం పొందిన కొన్నాళ్ళకే తన సంకల్పాన్ని ఆచరణలో తేవడానికి పూనుకొని కాషాయ వస్త్రాలు కట్టి రుద్రాక్షమాలలను వేసుకున్నారు. అంటే అంతరంగ మనస్సన్యాసముతో పాటు మూడు మూర్తులా బాహ్యములో కూడా సన్యాసివేషము ధరించాడు. ఈ సన్యాసివేష సంకల్పం ఆయనకు తిరుపతి కొండమీదే జరిగింది.

ఈ విషయమును పురస్కరించుకొని శ్రీ రామారావు గారు వెలిబుచ్చిన అభిప్రాయపు పత్రికాప్రకటన ఈ ప్రక్క పేజీలో చూపబడినది.

# నన్ను దేవుడే నడిపిస్తాడు

ఆంధ్రప్రభ,
19-4-'83.

హైదరాబాద్, ఏప్రిల్ 18, "రాష్ట్రాన్ని ఒక యోగి పరిపాలించడం మంచిది అన్నారు ఎన్.టి.ఆర్.

ముఖ్యమంత్రిగా మూడునెలలపాటు అధికారం చెలాయించిన తరువాత ఆయనకు కలిగిన అభిప్రాయం ఇది.

నాయకునికి లౌకిక బంధాలేమీ లేవని ప్రజలకు అనిపించాలి అన్నారు శ్రీ రామారావు.

శ్రీహరికోట నుండి ఆయన నిన్న సాయంత్రం తిరిగివస్తూనే ఆయన కాషాయ వేషం గురించి, తనను తాను సన్యాసిగా ప్రకటించుకోనటం గురించి పత్రికా విలేఖరులు ప్రశ్నించారు.

శ్రీ ఎన్. టి. ఆర్. ముదురు కాషాయ వర్ణపు ధోవతి, కుర్తా ధరించారు. బంగారు సరిగంచు

ఎర్రశాలువా భుజంపై వేసుకున్నారు. మెడలో రుద్రాక్షమాలకూడా ధరించి ఆయన పూర్తిగా సన్యాసిలాగే ఉన్నారు.

శ్రీహరికోటలో ఎస్. ఎల్. వి. ప్రయోగ సందర్భంగా శ్రీ ఎన్. టి. ఆర్. ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధిని కలుసుకున్నారు. ఆయన కాషాయ వేషం గురించి ప్రధాని ఏమన్నారు? అని ప్రశ్నించగా శ్రీ ఎన్. టి. ఆర్. చిరునవ్వు నవ్వారు. ఢిల్లీలో ఆమె నన్ను అడిగినప్పుడా, నేను మాంసాహారం తీసుకుంటానని చెప్పాను. ప్రస్తుతం నేను శాకాహారిగా మారిపోయిన విషయం ఇప్పుడామెకు చెప్పాను" అని ముఖ్యమంత్రి అన్నారు.

సన్యాసిగా మారిపోవడం, ముఖ్యమంత్రిగా పరిపాలనాధికారాలు చెలయించటానికేమీ అవరోధం కాదని శ్రీ ఎన్. టి. ఆర్. అన్నారు. బాధ్యతాయుతమైన పదవిని నిర్వహించటం ప్రజాసేవ చేయుటమే అవుతుంది. అదీగాక ముఖ్యమంత్రి పదవి కారణంగా నేను స్వార్థప్రయోజనాన్నేమీ ఆశించటం లేదు అని ఆయన స్పష్టీకరించారు.

కాషాయ వేషం ధరించాలనే నిర్ణయం హఠాత్తుగా తీసుకున్నారా లేక చాలా కాలంగా ఈ విషయమై ఆలోచిస్తూ ఉండి ఇప్పుడు సన్యాసిగా మారారా? అని ప్రశ్నించగా శ్రీ ఎన్. టి. ఆర్. తాత్త్విక ధోరణిలో సమాధానం చెప్పారు. "నన్ను దేవుడే నడిపిస్తున్నాడు. దేవుడు నా జీవితంలో మార్పులు ప్రవేశ పెడుతున్నాడు" అని ముఖ్యమంత్రి అన్నారు.

రాష్ట్ర వ్యవహారాలన్నీ ధర్మబద్ధుడైన వ్యక్తి పర్యవేక్షణలో ఉన్నాయని ప్రజలు భావించగలరని శ్రీ ఎన్. టి. ఆర్. అన్నారు. దురాలోచనా పరులెవ్వరూ తన చెంతకు చేరలేరని కూడా ఆయన అన్నారు.

తన సర్వసంగ పరిత్యాగం కారణంగా ముఖ్యమంత్రి పదవికి మరింత ఔన్నత్యం చేకూరుతుందని శ్రీ ఎన్. టి. ఆర్. అన్నారు. సన్యాస జీవితం గడపాలనే నిర్ణయం కారణంగా తాను ఇతోధికంగా ఆత్మపరీక్ష చేసుకొనే అవకాశం కలుగుతుందన్నారు.

—o—

(7) రామధర్మజుల ఆశయం బ్ర. వా.

శ్రీ యన్. టి. ఆర్. గారికి స. వి.

రామారావుగారి ఉద్దేశం సర్వసంపదలతో సుభిక్షమైన రామరాజ్యాన్ని దేశంలో స్థాపించడమే ని గ్రహించాలి.

8) ఆశయ సిద్ధికొరకు సంచారం

1) తారలు రాలుట బ్ర. వా.

శ్రీ యన్. టి. ఆర్. గారికి స. వి.

ఈయన పార్టీ పెట్టిన కొద్దికాలానికే ఇతర పక్షనాయకులు అధికారమునుండి జారిపోవడమే తారలు రాలడం అన్న దానికి నిదర్శనం.

8) 2) వృషభ నందిమీద వచ్చుట బ్ర. వా.

శ్రీ యన్. టి. ఆర్. గారికి సమన్వయించిన విధము

వృషభనంది అనగా వైశాఖమాసము. అప్పటినుండి ఆయన పార్టీ సంచార కార్యక్రమము అధికమవుతుందని భావము

8) 3) ముదమందుచుండుట

శ్రీ యన్. టి. ఆర్. గారికి సమన్వయించిన విధము

ఈ వాక్యములో రమణీమణి అనగా రాజ్యలక్ష్మి అని గ్రహించవలసి వున్నది. అనగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ

బాధ్యతను స్వీకరించుట యని భావము. ఆ పదవీ స్వీకారము మూడులోకములకు ముదము కూర్చునని కాలజ్ఞానం అనుచున్నది. శ్రీ రామారావుగారు పార్టీ పెట్టడం, అది కొలది కాలములోనే అభివృద్ధి చెంది విజయలక్ష్మిని చేపట్టుట. ఈ విషయమును ప్రపంచమంతయు గమనించి ఆశ్చర్యపడుట మనము గమనించిన విషయము లేకదా!

9) విజయములు

1) జనులు విస్తరిల్లుట బ్ర. వా.
శ్రీ యన్. టి. ఆర్. గారికి సమన్వయించిన విధము

రామారావుగారి సంచారములో స్త్రీ, బాల, వృద్ధ భేదము లేకుండా జనులు తండోప తండాలుగా రావడం మనం చూచే వున్నాము.

ఇది గొప్ప జనాకర్షణగదా ! ఈ విషయమునే కాలజ్ఞానం "వీరవసంతూని విజయాములయ్యాని విరివిగ జనుల్ విస్తరిల్లీనిమా" అని చెప్పినది.

9) 2) మార్గశిర పూర్ణిమ బ్ర. వా.
శ్రీ యన్. టి. ఆర్. గారికి సమన్వయించిన విధము

మార్గశిర పూర్ణిమ (30—12—82) అఖండ విజయము చేకూరి ప్రభుత్వము చేజిక్కడానికి ఈ పూర్ణిమ, ఆనాడు వచ్చిన చంద్రగ్రహణమే కారణములుగదా!

9. (3) విజయీకృతము. బ్ర. వా.
శ్రీ యన్. టి. ఆర్. గారికి స. వి.

పైన పేర్కొన్న కారణాలవలన ఆయనకు అఖండ విజయము చేకూరి ప్రభుత్వం హస్తగతం కావడమే విజయీకృతము అంటే.

10. యుగసంధి బ్ర. వా.
శ్రీ యన్. టి. ఆర్. గారికి స. వి.

మార్గశిర శుద్ధ అష్టమి (23-12-82) యుగసంధి జరిగినట్లు ఈ వాక్యములు సూచించుచున్నవి. "చంద్రుని కాంతి కానకపోదురు." అనగా చంద్రునివంటి వాడైన ఈ రామారావు ప్రతిభను కొందరు గుర్తించలేరని భావము. అట్లే సూర్యదీప్తి అణగిపోవుననగా ఇదివరకువున్న ప్రభుత్వము వెనుకడుగు వేయునని భావము. ఇదే యుగసంధి.

11. మార్గశిరం ప్రసన్నత
(1) మందిరం చేరుట బ్ర. వా.
శ్రీ యన్. టి. రామారావుగారికి సమన్వయించిన విధం

మందిరం చేరుటయనగా మార్గశిర మాసంలో (జనవరి) ముఖ్యమంత్రి పదవిని చేపట్టి క్రమంగా దానికి స్థిరత్వం సంపాదించటం. ఈపని జరిగి ప్రసన్నత ఏర్పడింది. మలినములు

మాసి మహత్ ప్రకాశము కలుగుచుండుటను మనము చూచు చునే యున్నాము గదా. ఈవాక్యంలో నదులు మూడు అని ఒక మాటయున్నది. ఇది కృష్ణాజలములను రాయలసీమకు, తమిళనాడుకును, పంచిన రహస్యమును కూడా చాటుట లేదా. అనగా ఒకే కృష్ణానది మూడు ప్రాంతాలకు ప్రాకి మూడు నదులుగా అయి వారి వారి అవసరములను తీర్చుచున్నదను రహస్యము గమనింప వలయును.

11. (2) వీరదేవత్వము బ్ర, వా.
శ్రీ. యన్. టి. ఆర్. గారికి స. వి

బ్రహ్మముగారికి వీరగురుదేవుడని కూడ పేరువున్నది. అట్టి బ్రహ్మముగారి శక్తియే ఇప్పుడీ రూపంగా మార్గశిర మాసంలో (డిశంబరు, జనవరి) వ్యక్తమైనదని భావము.

11. (3) అక్షోణీలు బ్ర. వా.
శ్రీ. యన్. టి ఆర్. గారికి స. వి.

ఇక్కడ కొన్ని పుస్తకములలో అక్షోహిణీపదం అక్షోణి అని వున్నది. అక్షోహిణీఅంటె భూమండలం అంతాఅని అర్థం. అక్షోణి అంటే మన భారతదేశం వరకే అది పరిమితమని సారాంశం.

శ్రీ రామారావుగారి తెలుగుదేశం పరిపాలన యావత్ భారతదేశానికి వ్యాపించవలెననే భావము సూచిత మగు చున్నది.

12. పంచమం. బ్రి. వా.
శ్రీ. యన్. టి. ఆర్. గారికి స. వి.

పంచమంఅనగా అయిదవదని అర్థము. అంటే అయిదవ తారీఖని స్పష్టీకరణ స్పష్టమేకదా. ఆనందాశ్రితులు బ్రహ్మము గారికి పూర్వజన్మ గురువులు గనుకనువారి సంప్రదాయములో వేదములు అయిదుగనుకను ఆ అయిదవ వేదమునకు తనగురువైన ఆనందాశ్రితులు అధిదేవతయని చెప్పబడినది. ఇలాచెప్పుట చేత 5వ తేది సూచించబడడమే గాక అయిదవదయిన ప్రణవవేద ధర్మముకూడా ఈమహా పురుషుని ద్వారా ప్రచారమవుతుందని పరమ రహస్యము. అంటే శ్రీ రామారావుగారి పరిపాలన అంతా ఆధ్యాత్మిక వాతావరణమయం కావలె నన్నమాట. ఈసందర్భములో 1983 జనవరి 5వ తేదీన ఎన్నికలు జరుగడానికి కూడా ఈ పంచమశబ్దం సూచిస్తున్నది.

5వ తేదీన జరిగిన ఎన్నికలే రామారావు విజయమునకు హేతువుగా కాలజ్ఞానమునగల "రామధర్మజులకు పంచమే కారణం" అని తెలుపుచున్నది.

13. రామధర్మజ రాజ్యమునకు హేతువులు.

(1) శిరోమణి నిర్ణయం. బ్రి. వా.
శ్రీ. యన్. టి. ఆర్. గారికి స. వి.

మార్గశిరపూర్ణిమ చంద్రగ్రహణం. సిద్ధాంత శిరోమణి

మైన జ్యోతిశ్శాస్త్ర నిర్ణయ ప్రకారమే జరిగినదని, దానిని అనుసరించియే ఈమార్పులన్నీ వచ్చినవని తెలియవలయును.

13. (2) రామధర్మజరాజ్యం. బ్ర. వా.
శ్రీ. యన్. టి. ఆర్. గారికి స. వి.

ఆరుమాసముల వరకు ప్రభుత్వం కొన్ని ఇబ్బందుల నెదుర్కొన వలెనని ఆపైన ప్రతికక్షులను కూడా లోబరచు కొనునని దీని సూచన.

13, (3) రామరాజ్యం - బ్ర. వా.
శ్రీ. యన్. టి. ఆర్. గారికి స. వి.

ఈశ్లోకాలు గ్రాంథికభాషకు లొంగేవి కావు. ఆ మహానుభావుడైన బ్రహ్మంగారి యొక్క హృదయగత భావాన్ని ఆయన క్లిష్టమైన రీతిగా వ్యక్తము చేస్తున్నది. పండితులు దీనిలోని భాషకు ప్రాధాన్యమీయక భావాన్నే అందుకొనవలెను. ఆవిషయం తాత్పర్యంలో వ్రాయబడినది.

14. ఆదివారం పట్టాభిషేకం
(1) సుకుమార దివ్యదేహము
శ్రీ యన్. టి. ఆర్. గారికి సమన్వయించిన విధము

9-1-83వ తేదీ ఆదివారం (మార్గశిరబహుళ ఏకాదశి) శ్రీరామారావుగారు ముఖ్యమంత్రి ప్రమాణస్వీకారము జరిగి

నది గనుక ఈ ఆదివారమనే మాట ప్రత్యక్ష సత్యమేకదా. ఇది బ్రహ్మవాక్యము గాక మరేమి?

14. (2) నమ్మియుండుట బ్ర. వా.

శ్రీ యన్. టి. ఆర్. గారికి సమన్వయించిన విధము

కాలజ్ఞానవాక్యములను సరిగా అర్థం చేసుకొని వాటి మీద విశ్వాసం కలిగివుండే వారికి అన్ని కార్యములు సమకూరుతాయని ఈమాటలు చెబుతున్నవి. "రామధర్మజుల మాట నమ్మి యుండేది" అనగా బ్రహ్మంగారి మాట నిమ్మిన వారికి ప్రజాపాలనాది సమస్త సిద్ధులు కూడా చేకూరునని దీని భావము. రామారావుగారు అలా నమ్మిన భక్తులు గనుకనే బ్రహ్మంగారి చిత్రం తీసినప్పటి నుండి ఆయన జీవితములో ఎన్నో మార్పులు కలిగి రాష్ట్ర ముఖ్యమంత్రియై జనక చక్రవర్తివలె సర్వసంగ పరిత్యాగి యగుటయే గాక సన్యాసి వేషమును కూడా ధరించి దేశోద్ధరణ చేయుచున్నారు. రామధర్మజనామముతో పేర్కొనదగిన బ్రహ్మంగారిమాట.

15. రామధర్మజ రాజ్యపాలన

(1) కర్మనిష్ఠుల గౌరవించుట బ్ర, వా.

శ్రీ ఎన్. టి. ఆర్. గారికి స. వి.

పట్నాలలో లక్ష్మి ఏడ్వటమంటే లంచగొండులుకొల్లగొట్టిన ధనలక్ష్మి ఏడుస్తూ బయటికి రావడమే. చీకటి

డబ్బును బయటకు తీసి దానిఅధిపతులను దండించడం. కర్మ నిష్ఠుల గౌరవించడమంటే సదాచారపరులను, తత్త్వవేత్తలను, పూజించడం ఈసందర్భములో మనముఖ్యమంత్రి రామారావు బ్రహ్మంగారి మఠాన్ని దర్శించడం. కంచి కామకోటి పీఠాధి పతి శ్రీచంద్రశేఖర స్వామిని దర్శించడం మొదలైనవిగా గ్రహించవలసి వున్నది.

### 15. (2) సామఅథర్వణము బ్ర. వా. శ్రీ ఎన్. టి. ఆర్. గారికి స. వి.

మానవుని లౌకికజీవితం సుఖమయము ఆనందమయము కావ డానికి వైద్యము, శిల్పము, చేతివృత్తులు వ్యవ సాయం భూసంస్కరణలు, మొదలైనవి అత్యావసరాలు. ఈ లాంటివన్ని అథర్వణవేదములో అత్యద్భుతముగా చెప్పబడి వున్నవి. వాటిని బయలు పరచి ఈప్రభుత్వము ప్రజోప యోగం చేస్తుందని ఆశించవలయును, ముఖ్యమంత్రి రామారావుగారు తనపాలన వేదసమ్మతముగా వుంటుందని ఒక ఉపన్యాసములో చెప్పిన సంగతిని కూడా ఇక్కడ స్మరించవలె.

సామమును తెలుపుటలో ఈపరిపాలన స్వర్గలోకముగా వుండునట్లు నడిపించుటకు రామారావుగారు కార్యసాధనలో వుండగలరని తెలుపుచున్నది.

15. (3) దుష్టుని ధ్వంసము (బ. వా,
శ్రీ) ఎన్. టి. ఆర్. గారికి స. వి.

ఈవాక్యానికి అవినీతిపరులను శిక్షించి అవినీతినిపార ద్రోలడం జరుగునని భావము. అలాజరుగుట మనము ఇప్పటి పరిపాలనలో జూచుచున్నాము.

1. (4) రామం రామం అనేరాజ్యం (బ, వా.
శ్రీ) ఎన్. టి. ఆర్. గారికి, స. వి.

అలనాటి రాముడు ప్రజలందరికి పూజనీయుడైనట్లే ఈనాటి ముఖ్యమంత్రి శ్రీరామారావు కూడా మూడువంతులకు పైబడిన తెలుగు ప్రజల అనురాగాన్ని చూరగొనియే తన పరిపాలన కొనసాగిస్తున్నాడు.

ఆబాలగోపాలము ఆయన ఈనాడు ఏమిచెప్పినాడాఅని రేడియోలకు ఎగబడడం పత్రికలను పరిశీలించడం, మనం గమనించుచునే వున్నాము.

16, మహిమలు

(1) సర్వసముడు (బ. వా,
శ్రీ యన్. టి. ఆర్. గారికి, స, వి,

శ్రీరామచంద్రుని మాదిరిగానే రామారావుగారు కూడా సర్వసముడుగానే ప్రవర్తించుచున్నాడు. కొందరిని

శిక్షించినప్పటికిన్ని ఆశిక్షవారిలోని చెడ్డతనమునకేగాని వారికి గాదు. ఆచెడ్డలను తొలగించుకొని వారు క్షేమంగా జీవించాలనే రామారావుగారి ఉద్దేశము. ఇదియే సర్వసమత్వమంటే.

16, (2) ఏకాక్షరముమీద నడిపించుట బ్ర, వా,
శ్రీ యన్. టి. అర్. గారికి, స. వి.

ఏకాక్షరముమీద నడిపించడమంటే తన ఆజ్ఞకు ఎదురు లేకుండా నడిపించడం. ఉపసంహారము లేకుండా నడిపించడం. అనగా ధర్మమును అంతనిక్కచ్చిగా నడుపుతాడని భావము.

16, (3) వైశాఖవిదియ బ్ర, వా.
శ్రీ యన్. టి. అర్, గారికి, స. వి.

శ్రీరామారావు తన సంచారకార్యక్రమము వైశాఖ మాసంనుండి జరుపుచుండుట మనకు తెలిసియేయున్నది గదా.

16) 4) వీరధర్మజుని సేవ - బ్ర. వా.
శ్రీ ఎన్. టి. అర్. గారికి స. వి.

వీరధర్మజుడైన బ్రహ్మముగారిని సేవించువారు ఆయన ఆశీర్వాదము చేత ఎంతటి దుర్ఘటిత కార్యములైనను సాధించ గలరని ఈ వాక్యములు మర్మయుక్తముగా బోధించుచున్నవి. ఇదికూడా ఆయనపై భక్తివిశ్వాసములు కలిగి యుండమని

ప్రజలకు బోధించు చున్నది. ఇందుకు రామారావుగారే నిదర్శనము.

16) 5) ఆచంద్ర తారార్కం కీర్తి - బ్ర. వా.
శ్రీ ఎన్. టి. ఆర్. గారికి స. వి.

రామారావుగారు సాధించిన ఈ విజయము ప్రపంచ చరిత్రలోనే అసాధారణమైనది. విదేశాలుకూడా ఈ సంగతిని విని తమ పత్రికలలో ఎంతగానో వ్రాసుకున్నవి. ఈ విజయాన్ని సాధించిన వ్యక్తిని చూడాలని, ఆయన మాటలు వినాలని, తహతహపడుచున్నారు. ప్రపంచ చరిత్ర వున్నంత వరకు ఈ రామరాయ వృత్తాంతము స్వర్ణాక్షరములతో వ్రాయబడి ప్రకాశిస్తుంది.

16) 6) ప్రకాశము - బ్ర. వా.
శ్రీ రామారావుగారికి స. వి.

తెలుగు దేశాన్నే గాకుండా కడమ రాష్ట్రిలతో గూడిన యావద్భారత దేశాన్ని శ్రీ రామారావు పాలించే సూచనలు ఈ వాక్యాలలో కనపడు చున్నవి.

కన్నడలనెల్లా రేపే రక్షించేము అనేమాటవల్ల రామారావుగారు కన్నడ ముఖ్యమంత్రితో నెరపుకొన్న మైత్రి సూచింపబడుచున్నది గదా! అలాగే "రాజ్యము లెల్లా రేపే

పలేరు!" అనేమాట వల్లకూడా ఈ రామారావుగారు యావ ద్భారతమునకు అగ్రనాయకుడు కాగలడనే విషయం సూచింప బడుట లేదా!

16) 7) మగువ భారము అణగుట - బ్ర. వా.
శ్రీ యన్. టి. ఆర్. గారికి సమన్వయించిన విధము

కాలజ్ఞానములోనికెల్లా ఇది ఎంతో ప్రముఖమైన వాక్యము. "మగువ భారము అణగిపోయేనిమా" అనడం సామాన్యులకు సాధ్యంకాదు. యావద్భారత దేశములో అమ్మను దేవతా స్వరూపిణిగా అర్చించేవారు తెలుగువారే. అందుకనే చిరకాలంగా ఇక్కడ ఆమె పాలన కొనసాగింది. కలలోకూడా ఊహించనట్లుగా ఈరామధర్మజుని(రామారావు) ఉద్యమం ఆమె విజయాన్ని అరికట్టి వేసిందిగదా ! ఎందరు మహానాయకులు వచ్చి ప్రచారము చేసినా రామారావుమీదే ఓట్లవర్షము కురిసినది. ఆయనే తెలుగువారికి అధిపతి అయినాడు.

17) వీరధర్మజుల కాలమయం - బ్ర. వా.
శ్రీ యన్. టి. ఆర్. గారికి సమన్వయించిన విధము

ఇకముందు జరుగవలసిన మంచికంతటికి కాలమే కారణ మవుతుంది. మనము తొందరపడక ఆ కాలముకొరకు వేచి వుండాలి. తొందరపడితే పచ్చికాయ పండుతుందా? దానికి

కొంతసమయము కావలెనుకదా! ఆ సమయం కొరకు వేచి చూస్తే ఇపుడు దేశములో వున్న చెడుగులన్ని నశించి మంచి మహిమాస్పదముగా చేకూరుతుంది. గనుక శ్రీ రామారావు గారు తలపెట్టిన సంకల్పాలు నెరవేరడానికి, ఫలించడానికి మరికొంత కాలము అవసరమని ఈ వాక్యాలు సూచిస్తున్నవి.

18) భక్తి - బ్ర.-వా.

శ్రీ యన్. టి. ఆర్. గారికి స. వి.

దేవబ్రాహ్మణులనగా సృష్టి, స్థితి, లయము, తిరోధానము, అనుగ్రహము, ఆపదుద్ధరణము మొదలగు దివ్యశక్తులను ప్రసాదించెడి బ్రహ్మాదులును, ఆ బ్రహ్మాదులను శిల్పంద్వారా రూపొందించి, మంత్రములద్వారా వారిశక్తులను తమలో ఇముడ్చుకొనివుండు బ్రాహ్మణులును అని భావము ఇట్టి దేవతలమీదను, వారి నుపాసించెడి బ్రాహ్మణులమీదను భక్తి కలిగియుండుటయుగాక ఆ సమస్తమును నాలోనుంచి కొని దానిని శాసించు ప్రభుడనై రామధర్మజ నామముతో సేవింపదగిన నాయందు భక్తికలిగి ఉన్నచో అట్టివారికి ఏ కొరతలు నుండవు. వారు ప్రారంభించిన సమస్త కార్యముల యొక్క సిద్ధులను పొందగలుగుదురు.

19) ఉపేక్ష - బ్ర. వా.

శ్రీ యన్. టి. ఆర్. గారికి స. వి.

ఇంతవరకు వర్ణింపబడిన వీర (పర) బ్రహ్మ ధర్మాన్ని ఉపేక్షించినవారికి క్షేమం జరుగదని ఈ వాక్యాలు సూచిస్తున్నవి. కనుక బ్రహ్మస్వరూపులైన ప్రజలను, ప్రాణులను, ప్రపంచాన్ని ఆరాధించటమే రామధర్మజులవారి ధర్మము యొక్క ప్రత్యేకత అని ఈ వాక్యాలు నిస్సందేహముగా పలుకుచున్నవి.

గమనిక :— బ్ర. వా. - బ్రహ్మవాక్కు,
స. వి. - సమన్వయించిన విధం.

.... o ....

# కాలజ్ఞానమూలంలోని
# కొన్ని వచనములు

రామధర్మజ రాజ్యము, శ్రీరామధర్మజమూర్తి ఉద్భవమును పురస్కరించుకొని కాలజ్ఞానములోని కొన్ని ముఖ్యవచనములు క్రింద తెలుపబడినవి.

1. రామధర్మజులు
2. శృంగారమూర్తి
3. పుష్పవర్షములు
4. రామ రామాత్మ రామావతారం
5. దేవతా సార్వభౌముండైన రామావతారం
6. మందారధరుడైన సుందరాంగుడు
7. సామగానప్రియుడు
8. భోగభాగ్యాల మీద సాక్షాత్తు రామధర్మజమూర్తి
9. సర్వే సర్వనాటకధారి
10. సన్యాసి వేషము
11. సువర్ణచ్ఛాయ బోలినవారు
12. విభూతి తిలకం ధరించినవారు
13. పర్వతంమీద ఆరామ భోగభాగ్యముమీద సన్యాసి వేషము

